శ్రీ

# పెనుమెత్స మహాయోగిని



గ్రంథకర్త :

ఆడుసుమల్లి నారాయణరావు

ఎం. బి. బి. యస్

# స మ ర్ప ణ ము

పెనుమెత్స మహాయోగిని !
వినిపించితి నీదుమహిమ విశ్వమునకు నీ
యనుమతి లేకయె - యంకిత
మొనరించితి నాపయి - నిది యొప్పిదమమ్మా !

తప్పిదికాదు - పుణ్యచరితంబు రచించుటయన్న పాపపుం
గుప్పల జిమ్మివైచుట - యనూనశుభప్రద పుణ్య పుష్పముల్
గొప్పునఁగొంట - పూర్వభవలుంఠిత దుష్కృత మిట్టిదంచు క
న్విప్పుట - పుణ్యధామము త్రివిష్టపమందఁ బ్రయాణమాటయే.

పాయనిప్రేమ స్వప్నమున భక్తిపథంబునుజూపి మంత్రమే
దోపదేశమిచ్చితివి. యోగిని ! బొప్పనవారి సత్యనా
రాయణ ముద్దుబిడ్డకు; మహామతి నామె యనంతమైన యా
ప్యాయత నాటినుండియు నహర్నిశలున్ భజియించు నిన్నటన్.

జనకుండున్ బతి న్యాయవాదులయి శశ్వత్కీర్తి నార్జింప - నెం
దున లోపం బిసుమంతలేక, పతియందున్ భక్తి, యోగంబునం
దనురక్తిన్ గుడివాడ పట్టణమునన్ రాజేశ్వరీ నామధా
రిణి, నిన్నుం బ్రతి శుక్రవారమున గీర్తించున్ మహాయోగినీ.

ఆ పాప యొకనాడు నన్ను జేరి

శాశ్వతహీనమైన భవసాగర మీదెడు మార్గ మొండు యో
గీశ్వరియే వచించుఁ దమ కెట్టులనే నటు రండటన్న – ఈ
విశ్వపు మాయ యేమొ, ప్రభవింపదు కోరిక నిన్నుజూడ, రా
జేశ్వరి చిన్నబుచ్చుకొనె జిన్నతనంబగుటన్ తపస్వినీ!

కాజ వేంకటరామయ్య కారు మీద
తోడుగా మాధవాచారిఁ దోడితెచ్చి
యోగినింజూడ రమ్మని వేగిరింప
పయనమై పెనుమెత్సకు వచ్చినాడ!

కాంచితి వచ్చి నిన్ను – కుతుకమ్మున నీ మహిమమ్ము వ్రాయ వాం
ఛించితి – పద్మనాభునకుఁ దెల్పితి – నీ చరితమ్ముఁ గొంటి – నే
వించితి నీ పదమ్ముల వివేకమునన్ – గుడివాడ సేరి యో
చించితి – దీక్షఁబూనితి లిఖింపగ నీ మహిమంబు భక్తితో.

కైతను సిద్ధహస్తుఁడను గా నయినన్ వచియింతు హైందవా
తీతము నీ చరిత్రము – మదీయభవమ్ము దరించుఁ దాన – వి
ఖ్యాతిఁ దలంచి కాదు – అవకాశముగల్గెను నేటి కిట్లు – నా
చేతము పొంగి యీ దుడుకు సేఁతకు దింపె మహాతపస్వినీ!

ప్రాయము షష్టిపూర్తి కొకవర్ష చతుష్టయమడ్డు – కమ్మ వం
శీయుఁడ – శస్త్రవైద్యసుఖజీవనదక్షుఁడ – నడ్సుమల్లి నా
రాయణరావు నామకుఁడ – వ్రాసితి నీ చరితంబు గద్యప
ద్యాయుత కావ్యశైలిని, ముదంబొనరింపగ భక్తకోటికిన్.

అమ్మరో ! నీకు నీ చరిత మంకితమిచ్చుచునుంటి - నాదు లో
పమ్ముల సైచి, తప్పు లోకవంకకుఁ ద్రోచి, గుణమ్ములున్నఁ గై
కొమ్ము, కృతార్థు సేయు, మనఁగూడదుగాని తనూజు సర్వదో
షమ్ములఁ ద్రోచిపుచ్చుటయు సాకుటయేగద తల్లి బాధ్యతల్.

కమ్మకులీనవౌటను జగమ్మున వ్యాప్తముగాదు నీ చరి
త్రమ్ము మఱొక్క యున్నతకులమ్మున నీవు జనించియున్నచో
నిమ్మహి ప్రాఁకియుండెడిది యీసరికే భవదీయజన్మ స
త్యమ్ము - చరిత్ర చాటిన యథార్థమిదమ్మ ! మహాతపస్విని !

రాజుల కంకితమ్ము కవిరాజు లొసంగిరి మున్ను - వారి కో
వాజుల నగ్రహారముల భద్రగజంబుల రత్నరాశి నీ
రాజనమిచ్చి రా నృపులు - రాజులనే కవు లందలంబులన్
బూజయొనర్చి రంతె - కృతి మున్నెవరిచ్చిరి వస్త్రహీనకున్.

కోరిన కోరకున్న - తమకున్ ధనమిచ్చిన నీయకున్న - మా
వార లొసంగి రంకితము పార్థులకున్ సచివాళికిన్ జమీం
దారులకున్ నవాబుల కుదారులకున్ దళవాయులౌ మహా
వీరులకున్ ద్రిమూర్తులకు - వీర లొసంగిరె వస్త్రహీనకున్.

పాతలు రోఁతలాయెను - నవమ్ములు వమ్ములు - దాన నేటి సం
పూత తపస్విని చరితముం గొని యున్నది యున్నరీతిగా
కైత సృజించి - జీవితము గన్నులఁ గట్టితినమ్మ ! యెల్ల రీ
చేత సమంజసంబని వచింపగ లోకము నిన్ భజింపగన్.

— కృతికర్త.

శ్రీ

# పెనుమొత్స మహాయోగిని



## 1. సంసారాంధకారము

శ్రీ భారతాంబ చాఁచిన బాహుయుగ్మమై
శీతనగంబు విస్తృతము నంద
నిలఁద్రొక్కి-నట్టి జంఘలకీవి తూరుపు
పడమటికనుమలు బార్లుదీర
కంచుకమ్మునఁ గప్పఁగాఁబడ్డ వక్షమ్ము
రీతి వింధ్యాద్రి గర్వించుచుండ
కప్పిన బందరు కనకాంబరంబటుల్
శ్యామల సస్యదేశంబు వెలయ

శీర్షపున్ ముసుఁగట్లు కాశ్మీర మొప్ప -
వలఁకులం గొల్చుచున్న ద్వీపంబనంగ
సింహళంబు బరాబరుల్ సెప్పి చేయ
నుండు హైందవ మాసియాఖండమందు.

పశ్చిమోత్తర పూర్వ భూభాగములను
పడమటిమల గట్టులతేఁడు పొడుపు గుబ్బ
లిడని కోటగా – సంద్రమ్ము గడవరాని
పరిఘుగా – భారతావని వన్నెకెక్కు.

భారతభూమిలో సగముభాగము నేలిన యార్యజాతి కాశ్మీరము వీడి, వింధ్యవనసీమలఁదాఁటి, ప్రపూతవాహినీ తీరములన్ ఫలించెడి క్షితింగని, యచ్చటి దాక్షిణాత్యులం బారగఁదోలి రాజ్యపరిపాలన సేయఁగనెంచె నీర్ష్యమై.

ఔత్తరేయులు క్షత్రియు – లాంధ్రభూమి
గాలువెట్ట సంగ్రామరంగమ్మునందు
చించి చెండాడి కసవు దిన్పించినారు
వెలమ రెడ్డి కాపులు, కమ్మ వీరభటులు.

అందు.

దుర్వారగర్వాంధ ధూర్తశాత్రవకోటి
గత్తిచేఁ దూల్చిరి కమ్మ~ ~
భారత సామ్రాజ్యభారమ్ము భుజ పీఠి
కనుజేర్చి యేలిరి కమ్మవారు
బధిర పంగ్వంధ క్షపణక భిక్షుసమితిఁ
గాచి పోషించిరి కమ్మవారు
పరదేశపాలక ప్రాపితదాస్యమ్ము
గడముట్టఁ జేసిరి కమ్మవారు

## సంసారాంధకారము

కవిత సెప్పిరి సాకిరి కమ్మవారు
కలిమి బలములు గలవారు కమ్మవారు
ఘన యశోభూషితాంగులు కమ్మవారు
కరముచాఁపని ధీరులు కమ్మవారు.

గోదావరీకృష్ణ కేదార భూముల
కనకమ్ముపిండిరి కమ్మవారు
రాజకీయాంతర రమ్య రంగమ్ముల
ఖ్యాతిగాంచినవారు కమ్మవారు
రూపవాణీకళారూపితకుశలులై
గణనకెక్కినవారు కమ్మవారు
సత్కళాశాలల స్థాపించి పోషించు
కార్యదీక్షగలారు కమ్మవారు

గానవిద్యాప్రవీణులు కమ్మవారు
కలిత వైద్యవిద్యానిధుల్ కమ్మవారు
ఘనులు న్యాయశాస్త్రమ్మునఁ గమ్మవారు
కష్టముల లెక్కసేయరు కమ్మవారు.

ప్రాచ్య వచోపరిపాలన దక్షులు
దొడ్డదొరలు వాసిరెడ్డివారు
కవిరాజ పండిత గాయకపోషణ
గట్టివారలు యార్లగడ్డవారు

ఆంగ్లప్రభుత్వ మధ్యప్రదేశావనీ
కాంతులు ఈడుపుగంటివారు
రాజకీయజ్ఞాన ప్రౌఢవైద్యన్యాయ
విజ్ఞు లడుసుమల్లి విబుధవరులు

కావ్య నిర్మాణదక్షు లఖండకీర్తి
భార దూర్వహుల్ తుమ్మలవారు - ధన కు
బేరు లల గోగినేని వా రారయఁ గల
రింక నెందఱో కమ్మవా రీ ధరిత్రి.

ఏవం విధగుణవర్థిత
మా వంశమున చెఱుకూరి యను వంగడమం
దావిర్భవించె బ్రహ్మయ
పావనమైన పెనుమెత్స పల్లియలోనన్.

యాచకజనమున కమృతంపు నడబావి
పేదబాపలకెల్ల వేల్పు గిడ్డి
తనతోడి రైతుసంతతికి తంగెడిజున్ను
మేటిపురోహిత మేరునగము
సన్యాసి బిక్షుక జనకల్పవృక్షమ్ము
నాశ్రొన్నవారి సస్యంపుగాదె
బధిర పంగ్వంధులపాలి యర్థపుపేటి
పేదవిద్యార్థుల పెరటిమందు

అడిగి లేదనుపించుకొన్నట్టివారు
పలికి సత్యంబుఁ గెంటింపఁబడినవారు
తడిసి యిలుసేరి వెడలింపఁబడినవారు
మందునకుఁ గాని లేరు బ్రహ్మాయునియింట.

శ్రీరామమ్మ స్వసంసా
రారామపుఁ దోఁటమాలియై తనతోడై
గారాబు బిడ్డలఁ బెనుప
వారములెల్ల నిముసముల భాతిఁ బరువిడెన్.

ఆ యపరానసూయాత్రులకుఁగల్గిన సప్తసంతానములో

పుత్రకులందున మొదటియాతఁడు సుగు
ణంబులప్రోవు కుటుంబరావు
నీతిని, మానవజాతిలో వెలలేని
రత్నమ్మ వేంకటరత్నమాళి
మూడవయాతఁ డమూల్యమా భక్తికి
తావు గంగాధరరావు దెలియ
ఆడుబిడ్డలలోన నపరాన్నపూర్ణయై
యలరారు నన్నపూర్ణమ్మసాధ్వి

దివ్యతమమైన పూజ్య పతివ్రతా గు
ణమ్ములకు వల్లి నాగరత్నమ్మతల్లి
కట్టకడపటి యమ్మ యఖండకీర్తి
కాలవాలమ్ము సూర్యావతమ్మ సుమ్ము.

సప్తసంతానమందు నక్షయము కావ్య
మట్టు లీ సప్తసంతానమందు స్థిరము,
జన్మలేని, ముదిమిరాని, చావఁబోని,
సీతమాహ్వాయ మూఁడవ కూఁతురాయె.

వాలూణశకము పదియు తొమ్మిదివందల యిరువదియొకటవ సంవత్సరమున ఆగష్టుమాసమున.

వర్షాకాలంబున నొక
కర్షకు నింట జనియించెఁ గనువారలకున్
హర్షం బొనఁగూర్చు చొక మ
హర్షిణి యా నని విధిజ్ఞు లాడుచునుండన్.

ఆ పసిప్రాయమందె.

ఊరక యేడ్చె నా యుయ్యాలలోనుండి
"ఓం" కారనాదమ్ము లుట్టిపడును
కాలు నేతులు త్రిప్పగా సుఖసిద్ధ ప
ద్మాసనాదుల వైచినట్టులుండు
గ్రుక్కపట్టినఁ గనుఁగొన్నవారలకు ప్రా
ణాయామమున్ సల్పినట్టులుండు
ఉక్కురుంగలు చెప్పెనో దివ్యమైనట్టి
వేదవేదాంతము ల్వాడలుచుండు

ఊరకున్న సమాధిలో నున్నయట్లఁ
గానుపించు - నిద్రించెనా కమలనాభు
దివ్యదర్శనం బందిన తీరునుండు
పొత్తులన్ సీత ముచ్చటల్ హత్తు నాడు.

నలుఁగుఁబెట్టి దినమ్ము స్నానంబు సేయింప
దేహానఁ గాన్పించు దివ్యకాంతి
పువ్వద్ది యవయవంబులు సరిచేయుచో
నవ్వియే సేరు పద్మాసనమున
కనుదోయి రెప్పలఁ గాటుక వెట్టుచో
యోగనిమీలనం బొప్పుచుండు
పాల్వట్ట వదన గహ్వరమింత విప్పుచో
విశ్వరూపమ్ము గాన్పించుచుండు

ఉంగనిడు వేళ నుయ్యాల నూఁచు వేళఁ
బ్రక్కఁబండిన వేళ నిద్రఁగొను వేళఁ
దల్లి గ్రహియించి యోగతత్పరత-భయ వి
షాద నిస్పృహాశ్చర్య సమ్మోదమందు.

కోలగనున్న మోము-తళుకుల్ విరజిమ్మెడి మేనికాంతి-ము
త్యాల సరాల తీరిచిరొయన్న రదమ్ములు - బారునాస-మో
కాలును దాకు బాహువులు- కాటుక బోలు శిరోజముల్-గులా
బీలను బోలు చెక్కిళులఁ బెట్టి సృజించె విధాత సీతమన్.

గారాబమ్మునఁ దల్లి దండ్రియును ముక్కాలమ్ముగాపాడి-యె
వ్వారలున్నాచిన దృష్టిదోషమును నిర్వర్తించి, పోషింప-యో
గా రూఢత్వమునందు నాత్మజ యటం చానందముం జెందఁగ
వారంబుల్ నెల లబ్దములుగడిచె సంప్రాప్తించె బాల్యంబటన్

ఐదవయేట విద్యవినయమ్ములు లేమిని మానవుల్ చతు
ష్పాదులుగాఁగలారనుచు-భవ్యముహూర్తముసూచి యావి
ద్యాదశ పూర్తిసేయఁ బడికంపిరి; సీతమ - తల్లిదండ్రు లా
మోదమునంద నేర్చె నొకపూఁటనె యేఁబదియాఱు వర్ణముల్.

ప్రాథమికపాఠశాల యా గ్రామమందె
యుండ సీతమతల్లి యా యూరిబాల
బాలికలఁగూడి యాడుచు నాలుగేండ్ల
లోన నాల్గవతరగతిలో జయించె.

ఆటపాటలనైన యల్లరిసేయ - ద
సత్యమాడంగ నసహ్యపడును
పరులపాత్రంబులు దొంకిన ముట్ట - ద
స్తేయమెంతేఁ బ్రశంసించుచుండు
క్రిమికీటకాదుల సమయింపఁగాఁబో - ద
హింస పేర్చెప్పి హసించుచుండు
పెఱవారిసొత్తుకై పెరపెరలాడఁ బో -
దపరిగ్రహమున నానందపడును

కాలకృత్యముల్ దెలవాఱంగా నొనర్చు
శౌచమనివిన్న నత్యంత శ్రద్ధఁజూపు
జోగి బైరాగులం గన్నఁ జొక్కుచుండు
నేది లభియింపఁ దాన సంతృప్తినందు.

బాలల వెంటాడు బాలురఁగాంచుచుఁ
గాముకులరించు నెగ్గాడుచుండు
బడికిఁ జెల్లింపఁగావలయు జీతముకూడ
నడుగనేరనివారి కడిగియిచ్చు
గ్రంథాలతోపాటు వ్రాతపుల్లలఁగూడ
పేదబిడ్డలయింట విడచివచ్చు
వీథులఁ దిరుగాడు భిక్షుకతతిఁ జూచి
నిలఁబడి జాలి కన్నీరుగార్చు

జాడ్యబాధితుఁ గన్న విచారపడును
ముదుకవారలఁజూచి వాపోవుచుండు
చెడ్డ దీ జన్మమంచు యోచించుచుండు
తత్త్వవేత్త యా నాఁడె సీతమ్మతల్లి.

తివిరి వేదాంత సారంబు దెలియుచుండు,
తానె పెద్ద తనదు సహాధ్యాయులందు –
ప్రథమశ్రేణి పరీక్షలోఁ బట్టభద్ర
యగుచు గురుమహాదేవు మెప్పందుచుండు.

తల్లిదండ్రులభక్తి విద్యానురక్తి
పేదవారియం దాసక్తి విబుధరక్తి
ఐహిక విషయాళి విరక్తి యాత్మశక్తి
యష్టవర్షమ్ములందె సీతమ్మకబ్బె.

క్రీస్తుశకము 1929 సంవత్సరప్రాంతమున.

శుల్కమ్ము నాసించి శోద్ధఛాందసులకుఁ
గన్నెలనిచ్చిన తెన్నుఁజూచి
అఱువది యేఁడుల వరునకు మూఁడేండ్ల
బాలికనిచ్చిన పరువుఁజూచి
పీడవిఱగడఁగా, విసుగెత్తి సుకుమారి
రోగులకిచ్చిన రోఁతఁజూచి
బాల్యసంప్రాప్తమా వైధవ్యమునఁ గుందు
బోడపీడని యాఁడుబిడ్డఁ జూచి
విశ్వమున హైందవులుగొన్న వెక్కిరింత
కడలి కన్నీరు మున్నీరుగా కృశించి
హారవిలాసశారద యన్ మహాత్ముఁ డొక ని
షేధ శాసనమున్, దెచ్చె స్త్రీలకొఱకు.

పదునాల్గేడులు నిండనట్టి సుతకున్ పాణిగ్రహం బింక చె
ల్లదు-గావించినవారు శాసనము నుల్లంఘించుకే-గాన న
య్యది శిక్షార్హము, తల్లిదండ్రులకె భోజ్యంబంచు, శాసింప న
య్యదిరాకుండఁగమున్నె కన్నెలకుసేయంబూని రుద్వాహముల్.

శారదా చట్ట మొక పెద్ద ఘోరమంచు
పాడుచేసె కన్యాదాన ఫలమటంచు
వలయు వర్షాష్టమమున వివాహమంచు
గోల సేసిరి ఛాందసకులమువారు.

అన్నెముం బున్నె మెఱుఁగని పాళికుండు
బ్రహ్మయాఖ్యుఁడు – బ్రాహ్మణ భక్తుఁ డతఁడు
శారదా చట్టమే యడ్డొ స్వర్గమున క
టంచు సీతమ్మ పెండ్లి సేయంగ నెంచె.

ఇంతలో గండిగుంట వాస్తవ్యుఁడైన యొకానొక భూసురుఁడు కార్యార్థియై యేతెంచి, వరాన్వేషియైయున్న బ్రహ్మయ్యను గాంచి.

"కృష్ణలో, గన్నవరమన్న కేంద్రమందు
గండిగుంట ఉయ్యూరు ప్రక్కను సివారు
గలదు – నాదెళ్లవారి నొకండు కృష్ణ
యాహ్వయుండట వసియించు – నతనిసుతుఁడు.

పదిరెండేఁడుల బాలకుండు వరుఁడావర్చస్సు దివ్యంబు – సంపద దానింతభుజించి పెక్కరకిడన్ వచ్చున్ – మరేకొంతయో చదువుండెన్ – యిక నేమికావలయు – నీ సంబంధమున్సేయ నొప్పిదమంచున్ వచియింప- బ్రహ్మయతలూఁ పెన్ బెండ్లిగావింపఁగన్.

నాఁటి సీతయే సీత యీనాఁటి వధువు –
రాముఁడే నేఁటి యీసీతరామవరుఁడు
దివ్యమైన సంబంధమ్ము – భవ్యమంచు
దల్లి తోడఁబుట్టినవారు దలఁచినారు.

తల్లిదండ్రులు బాంధవతతియు నొప్ప
మంచి సంబంధమంచు – బ్రాహ్మణుఁడు నాఁడె
చనియె గండిగుంటకును కృష్ణయ్యదరికి
వంతచెప్పఁగ వియ్యాలవారి కీవి.

పోయి కృష్ణయ్యచౌదరిని సమీపించి.

పెనుపాగ డ్డగన్న పెన్మెత్సగ్రామాన
వఱలెడి చెఱుకూరివంగడమున
కలఁడు బ్రహ్మయాఖ్య కర్షకముఖ్యుండు
వారి చుట్టఱికమె వలయు మనకు.

చక్కనికోవ – పాఁడి సిరిసంపద చాలినయంత – మన్ననల్
పెక్కు – బడాయి సుంతకనిపించదు – విద్దెకులోటులేదు– సొం
పెక్కువ – యావిధంబు కనమెచ్చుట – భాగ్యమటన్నవారిదే
యెక్కడనిట్టివియ్యములభించెడుమిత్రమ! కృష్ణయాహ్వయా!

కొడుకులు ముగ్వురు – కూఁతులు
కొడుకుల కొక్కరధికమ్ము – కూఁతులపై ప్రే
మెుడి యధికంబట – మూఁడవ
పడఁతుక యిపుడెన్మిదేండ్ల ప్రాయమునందెన్.

పదియార్వన్నెపసిండిబొమ్మ యది–దివ్యంబైన తేజంబు–సం
పదలొల్కించెడి మోముగోము–గనుచోపద్మాలయో పార్వతో
చదువుల్ రాణియొ–యెవ్వరీమెయనుచున్ సందేహమా–కానిచో
పదియేండ్లైనను లేని బాలకిటు లావణ్యంబు ప్రాప్తించునా?

వరకట్నంబున కేమిలెమ్ము–వధువే బంగారమున్ భూమియున్
గురుకట్నంబగు–దైవమెయ్యదియొమీకుంగూడఁ జేకూర్చె–మీ
పరువున్ మించిన గౌరవంబుగల–దాపై కొంత యే నేలో యి
త్తురువారైన–శుభస్యశీఘ్రమని యందున్ బెండ్లిగావింపుమా.

అనుచున్ భూసురుడాడుమాటలకు కృష్ణాఖ్యుండు హర్షించి యీ
కొని, పెన్మొత్తనకు నూరి పెద్దలను జేకొంచున్ బ్రవేశించి – క
న్యను వీక్షించె–ముదంబునంది వరకట్నం బెంతో యాలించి–యి
చ్చెను తాంబూలముబ్రహ్మయాఖ్యునకుసూచించెన్ వివాహమ్ముపై

అందఱు సంతసించిరి–ప్రయాణము సల్పెను కృష్ణయాఖ్యుఁ డా
నందముతోడ నింటి కొకనాఁడు ఫలంబులుఁ బిండివంటలున్
గందము దమ్మలంబు వసనంబులతోడను లగ్నలేఖ చే
సందె – నికెప్పుడెప్పుడని యందఱుఁ బెండిలి కుబ్బుచుండఁగన్.

చలికాలం బరుదెంచె– మంచుకణముల్ సస్యంబుల న్ముంచె– రా
చిలుకల్ చుట్టుచు జొన్నచేల విహరించెన్–బండుజాబిల్లి వె
న్నెలరేలం బొడగించె–నంబుదము లెందేఁజొచ్చె– పూవిల్తుకో
లలపాలంబడి మ్రగ్గిరెల్లరు విలోలంబైన డెందమ్ములన్.

కుచ్చెలపంటచీరతళుకుల్ ప్రసరింప – వివాహవేదికన్
జొచ్చెడి సస్యకాంతకు–వినూత్నహిమాంబు విభూషణమ్ములన్
వచ్చిన కాలభర్తకు – వివాహదినంబునఁ బెండ్లిపందిటన్
బచ్చనితోరణంబులయి బారులుగట్టెను కీరసంతతుల్.

మాపులఁ గుమ్మరించిన హిమాంబుకణమ్ముల తెల్పు–గుమ్మడిం
డాపిన పూలరశ్మి – నునుదాడిమపూవుల కెంపుసొంపు – కా
లూఁదఁగ పచ్చచేలయి నొప్పె మనోహరదృశ్యమప్డు హే
లాపురి రత్నకంబళివిలాసము చాటుచు సీతువందునన్.

చనుదెంచెన్ నవచైత్ర మంతటను – వృక్షచ్ఛాయలెంతే కృశిం
చెను–చూతంబులు పిందెలందొడఁగె–పూచెన్ వేప-భద్రాద్రిరా
ముని కల్యాణసభాస్థలిన్ శుకపికంబుల్ మంగళారావముల్
వినిచెన్ -హెచ్చిరి పుష్పలావికలు వృద్ధింగాల్చె బీరెండలున్.

దివ్యంబైన ముహూర్తమష్టమము శుద్ధింగన్న లగ్నమ్మ సం
స్తవ్యుల్ భూసురులగ్నిసాక్ష్యముగ మంత్రంబుల్ వెలార్పంగ సం
భావ్యంబౌచు వివాహమొప్పె వరుఁడున్ మాంగల్యముం గట్టె స
త్కావ్యంబై యలరారనుండ నిది గల్గంబోవునే లోపముల్.

అచట జనకమహర్షి బ్రహ్మయ్య యిట ద
శరథరాజేంద్రుఁ డచట కృష్ణయ్య యిచట
సీత సీతయే రాముఁడే సీత రాము
డంతె భేదమనుచు కవు లాడి రపుడు.

## సంసారాంధకారము

పందిట నొకమూల బాండు, నౌబత్ఖాన
మాంగళ్యవాద్యముల్ మాఱుమ్రోవ
మండువాలోఁగిటఁ దండతండంబులై
పెండ్లిముత్తైదువల్ గొండ్లిసేయ
వీధివాకిటనున్న పెండ్లిపెద్దల ముందు
నర్తకీజనము తాండవము సల్ప
కల్యాణమండపాగ్రస్థలి భూసురుల్
వేదోక్తమంత్రముల్ విప్పిచెప్ప

సందుగొందులలో బీదసాదులెల్ల
బారులందీర్చి భోజన మారగింప
ధనికులెల్లరు కట్నపెత్తనము సేయ
నందఱకు లగ్నసమయ మానందమయ్యె.

సాగెనో లేదొ వసంతమ్ము తలయెత్తి
మల్లెలు మొల్లలు కొల్లలాయె
పదమువెట్టెనో లేదొ వర్షర్తువాక్కట
పారుజాతమ్ములు ప్రసవమాయె
ఏతేరెనో లేదొ హేమంత మొకచెంత
'దొంతిదొంతర'ల చేమంతి పూచె
చిందువైచెనొ లేదొ శిశిరర్తువాక్కచో
ముండ్లపైని గులాబి మొగ్గదొడగె

కాలిడియెనో లేదో శరత్కాల మొకట
కన్నెమందార వికసింపగాఁ దొడంగె
పంచవర్షంబులేఁగె వివాహమాచు
పదియు మూఁడేండ్ల సీత పుష్పవతి యాయె.

కన్నెమోమున సుంత గనరాని నునుసిగ్గు
మొలకెత్తి యొడలెల్లఁ గలఁతవెట్టె
మగవారిచేఁతల నెగతాళిఁ గావించు
తన్వి తలుపు మూల దాఁగుకొనియె
వరుని గుణమ్ముల వర్ణించు భట్టుల
చెంపగా నిల్చి యాలింపఁదొడఁగె
బాహ్యేంద్రియమ్ముల పసఁజూడని నెలంత
సింగారమున కెంతొ లొంగిపోయె

నడకలోన నొయ్యారమ్ము గడలుకొనియె
మాటలందు ప్రౌఢత్వము దేటఁబడియె
చేఁతలందు శిష్టత్వమ్ము సేరఁదొడఁగె
యావనపు సొంపు లెంతయాహ్లాదమార !

మసిముసినవ్వు కెంబెదవి మోసులనెత్త - కనీనికద్వయం
బు సనఁగ నోక్కక్రేవ - నగవుం బడనెట్టుచు హెచ్చె కోపతా
మసములు–దన్నుఁగూర్చితనమానవసౌమ్యతఁగూర్చిబందుగుల్
గుసగుసలాడువేళఁ దన కోరిక లీరికలెత్తువేళలన్.

ముసిముసినవ్వు మోవి-యరమోడ్పు కనుంగవ-గండయుగ్మమం
దెసఁగెడి కాంతి-యప్పు డరవిచ్చు కులాభతనూలతోజ్వల
మ్ము-సరసమంజులోక్తులు-నపూర్వముఖాంచిత దివ్యకాంతి-సం
తసమొనగూర్చెఁ గన్నతలిదండ్రులకున్ నిజబంధుకోటికిన్.

అచ్చటి బాలబాలికల యాటలఁ గన్గొని చేరఁబోవ సి
గ్గిచ్చటనుండిరో దుముకు నింటికిఁ-జిన్నతనంపు ముద్దులున్
ముచ్చటలేమితీరవు - కపోలములం గయిసేర్చి యొంటిగా
ముచ్చిలు పుచ్చడీకతనముం దలపోయుచుఁ గూరుచుండెడిన్.

కడుపార భుజియింపగా క్షుత్తుగల్గిన
ప్రక్కవారలఁగాంచి మెక్కలేదు
వీధిలో వినవచ్చు వింతలఁ గనఁబోయి
పిన్నపెద్దలఁగాంచి వెనుకకేఁగు
సహపాఠుల వివాహసమయమ్ములం జేరి
చుట్టాలముందు గూర్చుండ వెఱచు
పనిపాటలందైన జననితోనైనను
గొంతెత్తి పల్క సిగ్గువడుచుండు

పొత్తముల హృదయమ్మున కత్తుకొనును
పొగసుకత్తైనే గన్నెత్తిచూడ వెఱచు
ఏటుగాఁ గటిఁబుట్టముల్ నిలుపుకొనును
మాటమాట నిదానించి మఱియుఁ బలుకు.

పూర్వజన్మమ్మునం దసంపూర్ణయోగ
కలస సీతమ్మ ముఖదివ్యకాంతి కడలి
నిగిరికింజేరెఁ బున్నమ నిండు చంద
మ్మ, యోటమిం దెలుప లోఁ మచ్చ నూనె.

ఇట్టులుండఁ నొకనాఁడు.

'కో' యటంచును గూయు కోయిలకంఠాన
ఓంకార నాదమ్ము లుజ్వలింప
ఊరూర యాచించు యోగిజనమ్ము బై
రాగులు దనస్థితప్రజ్ఞ రేఁప
మాగాణితోఁటల మామిడి నిమ్మలు
సాత్వికాహారంపు చవులు దెల్ప
వెన్నెల చీఁకటుల్ వెంటాడి యొకదాని
నొకటి ద్వంద్వాతీత మొకటచూప

పుట్టుక లొకవంక గిట్టుట యింకొక
వంకఁ బ్రాణికున్న బాధఁ దెలుప
సారవంతమానొ సంసారపుం గాథ
అధికభారమానొ యనుచుఁ దలఁచు.

పాటునిభక్తి భర్తృపదపంకజముల్ భజియింపఁ గోరి రా
మాయణమందు సీత రఘురాముని వెంట వనమ్ము సేరి యే
మాయెను పెక్కుకష్టముల నందెను రావణు చేతఁజిక్కి యే
దో యపవాదు నందె యిఁక నున్నదియేమి కులాంగనాళికిన్

సారవిహీనం బీ సం
సారము బాధలకు దుర్వ్యశములకు పారా
వారము జీవుని కారా
గారము దలపోయ నొక వికారము పృథివిన్.

పతి పతి యంచు ద్రౌపది దపంబొనరించి విరించిచేతఁ దా
బతుల దశార్థముం బడసె- పట్టసుఖం బదియేమి- పాండుసం
తతి యెదుటన్ బరాభవమునందె- ముకుందుఁడు గావకున్న నే
గతి యట సంభవించెడిదొ కాంతల కెక్కడ కీర్తి యుండెడిన్.

సత్యవంతుఁ డంచును హరిశ్చంద్రుఁ బెండ్లి
యగుచు చంద్రమతి మును సౌఖ్యమ్ము గొనెనె?
కష్టముల నందె, సుతుఁ బాసె, కడకు దొంగ
తనపు నేరాన పతిముందు వనరవలసె.

మును దమయంతి దిక్పతుల మోహము లాఱడివుచ్చి కోరికో
రి నలు స్వయంవరమ్మున వరించి వివాహమునాఁడె - పైని పొం
దిన ఫలమేమి? కాఱడవిఁ దీఱనికష్టము లందె బోయవా
తనుఁబడె నెట్టటో బ్రతికెఁ దన్వి కిహమ్మున సౌఖ్యమున్నదే.

గాథ లిన్నింటిఁ దెలిసి సౌఖ్యమ్ములేని
యిహసుఖమ్ము లాసించుటో యింతి - పరము
గోరి శారీరసౌఖ్యమ్ము దూఱనాడి
యాత్మ పరమాత్మఁ జేర్చుటో యరయవలయు.

అనుచుఁ దలపోయు నొక్కొక్క దినమునందు
భూరిసంసారభోగముల్ గోరు నొకటఁ
దేనిఁ దేల్చఁగాలేక బుద్ధి కలఁతవడ
సరసనున్నట్టి గ్రంథము ల్చదవఁదొడఁగు.

వనితలు పెక్కుమంది మగవారలఁ బెండిలియాడి నిత్యమూ
తనసుఖభాగ్యభోగసమతన్ ముదమందుచుఁ బుత్రపౌత్రులం
దునఁ దమముద్దుముచ్చటలఁ దూఁగుచు డెబ్బది యెన్బదేండ్లిహా
మ్మున వసియింపఁజూడమె నమోనమయంచునువారి మ్రొక్కమే

చుట్టములందు, బెక్కురు స్వసోదరులందునఁ గొంద ఱప్డె చే
పట్టిరి జంటకూర్ములు, సెబాసనఁ గాఁపుర మూఁపుచుండి, రే
పట్టున వారు దూష్యులు ? – శుభమ్మని దంపతులుండ నౌనుగా
కిట్టు లశుభమ్ములన్ మదిఁ దపించుటఁ జెల్లునె మానవాళికిన్.

ఏది యెటులున్న త్రిగుణమ్ములే జయించు
ప్రాణి- సీతమ్మ యందఱి వంటి దేహి
యేగదా నాఁడు–పదియునాఱేండ్లవయసు
కామవాంఛలు రేకెత్తు కాలమద్ది.

కొక్కరోకో యని కుక్కుటములు గూయ
చలి వేయుచున్నను శయ్య వీడు
మాతాపిలు తతొలిమాటఁ బల్కకమున్న
కాలకృత్యంబు లొక్కటను దీర్చ

పాఁడియావుల కింత పచ్చికబడ్డవైచి
లేదూడల పొదుగులేసెర విడచు
తలవాకిటనుజమ్మి కలయంపి వెదఁజల్లి
చూచి యంటులనెల్ల శుభ్రపఱచు

కట్టెపుల్లలఁగొని పొయ్యికడనయుంచు
వలయుకూరఁ దఱిగి సిద్ధపఱచు నింటి
కథితు లేతేర వారి కర్ఘ్యంబునిచ్చు
తల్లి కెడతోడు నీడ సీతమ్మ యెపుడు.

నడికిరేయైనఁ బగటికి నడుమ్మైనెన
ముదుకఁడైన బొడ్డూడని బుడుతఁడైన
వారివాఁడైన పెఱయింటివాఁడె యైన
వండి వడ్డింప నలయ దెన్నండు సీత.

కొంతకాలం బిట్లు సనినయంత 1937 సంవత్సరమున.

సుముహూర్తమ్మున నత్తమామ పతియున్ జుట్టంబు లేతేర సీ
తమతో భర్తనుఁజేర్చి కాఁపురముసేయం బంపి రత్తింటికిన్
హిమవంతుండు దనూజ నీశ్వరుని చేయించేర్చి కైలాసధా
మమ్మకై పంపినరీతి బంధువులు ప్రేమంబార వీక్షింపఁగన్.

కాల్వెట్టెనో లేదొ గడపలో నత్తవా
రింటి భాగ్యమ్మ మిన్నంటఁదొడఁగె
సాయపడెనో లేదొ సంసారమునఁ బాఁడి
పంటలు క్షణమొక్క వరుసఁ బెరిఁగె

చేతనుట్టెనో లేదో గోతాములం దిడ్డ
ధాన్యమ్ము లేనాఁడుఁతఱుగవాయె
వీక్షించెనో లేదో పెరటి వృక్షమ్ములు
కాలమ్ము లన్నింటఁ గావదొడఁగె

అత్తకెవ్వేళఁ బనుల నాయత్తపడియె
మామ కన్నింట నెనలేని మంత్రియాయె
నన్నిటను బ్రాణభర్త కర్ధాంగియాయె
నిరుగు పొరుగువారలకు నీశ్వరియె సీత.

తొలి శ్రీరాముని పాదసేవ యతిసంతోషమ్మునం జేసియున్
కలిలో వెండియు వానిఁగొల్వనగు సౌఖ్యంబందగానంచు సం
కులభారమ్మున సీత సీతయయి ప్రాజ్ఞుల్ మెచ్చ నీనాఁటి కు
త్తలపాటేమియు లేక సుస్థిరత సీతారాము పూజించెడిన్.

ధవుని కాహారమిడు వేళఁ దల్లియగుచు
నాటపాటలలో సహాధ్యాయిని యగు
మంతనమ్మునఁ దులలేని మంత్రియాను
ప్రియుని వలపించుఁ బ్రేమఁ జూపించి సీత.

తెల్లవాఱకముందె పిల్లతెమ్మెరలతో
లేచు, లేచి ధవునిఁ జూచి మ్రొక్కు
కాల్యకృత్యమ్ముల, క్షణములోఁ గావించు
గావించి గృహము చక్కగను దిద్దు

## సంసారాంధకారము

పాలిచ్చు కదుపుల బలురీతులను మేపు
మేపి లేదూడలఁ జేఁపవిడచు
పాల్దీసి బిందెలఁబట్టుఁ గరవఁగట్టి
విఱిగినపాలలో వెన్నఁదీయు

వంటకై యత్నమందు సర్వమ్ముఁగూర్చు
మామకున్ సాయమీయ సంభ్రమమునందు
ప్రియుని కెల్లకాలంబు సంప్రీతిఁగొలుపు
మెలఁగు నిరుగు పొరుగుతోడ కలసిమెలసి.

గుణవంతురాలు మాకోడలంచును గను
పడ్డవారలకెల్లఁ బలుకు నత్త
బంగారమయ్యా మావాని యిల్లాలంచు
స్నేహితతతికి వచించు మామ
అమ్మ కాల్పెట్టిన దాది మాత్సుత్తు చ
ల్లాఱెనంచాడు పాలేరుజనము
ఏది కోరినఁగాని లేదంచు నోట క
సరికొట్టదం చాడు నిరుగుపొరుగు

పొట్టగాలినవేళ మోమోటపడక
వేచియుంద్రు సీతమ్మకై బిచ్చగాండ్రు
పండి యొరుగనిచేలు చేఁపని మొదవులు
పెరటఁ గావనిమొక్కఁ గాన్పింప వపుడు.

అయిన.

కలికాలం బిది ధర్మవర్తనముచేఁ గాలుండు రక్షింపఁ డే
కలికిన్-త్రేతయు ద్వాపరంబు కృత వెన్కంబట్టె-సావిత్రులో
కల లైపోయిరి- మృత్యువెల్లరిని నాఘ్రాణించు- వేలేండ్లగా
కలి ధర్మంబిది - సీతరామునకు దుష్కాలంబు ప్రాప్తించెపో.

ఒక సంవత్సరమేఁగె నిద్దరకు నత్యుత్కృష్ట సంసారభా
గ్యకలామోదనిమగ్నతం బవలు రేలాగుబ్బునంబుచ్చ- భ
ర్తకు మేహంపురణంబుపుట్టెఁ గుడిచేతన్, శస్త్రవైద్యమ్ము చే
తకు మించెన్, బయి సన్నిపాత మొకచెంతంజేరెఁ బీడింపఁగన్

తెలతెలవాఱఁగా మలినవస్త్రము లూడ్చి
నాధుని లేపు స్నానమ్మునేయ
చలువవలువలిచ్చు సాంబ్రాణి పొగవెట్టు
నతిబలమిచ్చు నాహారమిచ్చు
నుండు గడుగువేళ నుండు వైద్యునకు సా
యంబీయు బాధ రానట్టు విసరు
పదముల నొత్తు చెంపల నిమురు జ్వరముఁ
జూచును బతిబాధఁజూచి కుందు

పజ్జనేయుండు నెవ్వేళఁ బనుల మఱచి
సుంత ముట్టదాహారమ్ము - చుట్టములకు
విడువఁగోరదు రోగిని, విశ్రమింప
దింత, రాముకై రాము ప్రార్థించుచుండు.

కాయమ్ము గృసియించెఁ గనులు లోఁట్టబడియె
వ్యాధి మనోవ్యాధి బతికి సతికి
నడక పూర్తిగఁబోయె నడక తబ్బిబ్బాయె
వ్యాధి మనోవ్యాధిఁ బతికి సతికి
సంధి గన్పించె వాగ్బంధన మేతెంచె
వ్యాధి మనోవ్యాధిఁ బతికి సతికి
నిలుగుడ్డువడియెఁ గనీనిక పైకేఁగె
వ్యాధి మనోవ్యాధిఁ బతికి సతికి

వచ్చె నాయాస మాశ సర్వమునశించె
వ్యాధిచే మనోవ్యాధిచేఁ బతికి సతికి
జీవ మెగసె దేహమ్ము నస్పృహతఁబడియె
వ్యాధిచే మనోవ్యాధిచేఁ బతికి సతికి.

**1939** సంవత్సరమున మహాశివరాత్రి యుదయము పది గంటలకు సీతారాముడు దివంగతుఁ డయ్యె.

చూచి మనోహరున్, విగతశోభుని, ప్రాణవిహీను, సీత యా
లోచనశూన్యయై పడె విలుంఠిత సుందరకల్పవల్లియో-
వీచులఁగొట్టఁబడ్డ యరవిందసుమమ్మొ- దివాకరప్రభా
వీచుల నెండి రాలు కరవీర ప్రసూనమొ నా ధరాస్థలిన్.

సప్తసంతతి నే విచారమెఱుంగని
తల్లిదండ్రుల యుల్ల మల్లలాడె
చెట్టంతకొడుకిటు గిట్టుట గనుగొన్న
యత్తమామలగుండె వ్రత్తలాయె
ఏడాదికూటికి నేబాధ లెఱుఁగని
పాలేరు మూఁకలు బావురుమనె
అందమై బంగారుకొండయౌ సీతమన్
దిలకించి పొరుగు కన్నీరువెట్టె

పెరటిమొక్కలు వడదెబ్బ ధరణి కొరగె
నడలె నపు డాలమంద లంబా యటంచు
భాతృదుఃఖమ్ము మితిలేని వఱదయాయె
వన్నె విడనాడి ప్రకృతియే చిన్నవోయె.

తన సంసారపు నావ బ్రద్దలయి సంతాపాబ్ధిలో మున్గె నిం
కను చుక్కానొకచేతఁబట్టఁగల భాగ్యంబేమి కన్పింప 'దే
మని ప్రాణమ్ములనిల్పనౌనొ సతి కాహార మ్మభోజ్యమ్ముగా
గనుపట్టెన్ మరణంబె శ్రేయమని లో గన్పించె నానాఁటికిన్.

ఉన్నదె జీవితమ్మున ప్రయోజనమన్నది యింక - పూర్వపా
పోన్నతి యెన్నిగుట్టలయియున్నదొ యీ భవమందుఁ దీర్ఘ-సం
పన్నత నేమియున్న యది మంగళసూత్రము లేనినాఁడు - నా
కన్నె దలంచు నెమ్మది కకావికలై హృదయమ్ము చిట్లగన్.

హృదయము వ్రక్కలాయె- కురులెక్కడివక్కడతుట్టగట్టె- కెం
బెదవులు వెల్లనాయె-మితిమీఱె విషాదము మోముదమ్మి- వీ
డదు నిముసమ్ము సెజ్జ- నకటా యను నోటికి నంతులేదు-వా
ల్పదు కనురెప్ప-దల్లికిని బల్కదు- **చూచును బిచ్చిచూపులన్.**

చందురుపూపవెన్నెలల సౌరు కృశింపగ- గాఱుచీఁకటుల్
చిందులుద్రొక్క- నేఁటి కిటు సీతమ డెందమునందు- నాశలె
ల్లం దునుమంబడెన్- విధివిలాసమవార్య మెవారికైన- నా
చందురుఁ డెన్నఁడీయెడఁ బచారులొనర్పగవచ్చునో కదా.

మాసెను పుట్టముల్-మెడనుమంగళసూత్రముమాయమయ్యె-నా
యాసము హెచ్చె-నెన్నుదుటియందలి కుంకుమబొట్టురాలె-సం
తోసము నిష్క్రమించె- గడుదుర్భరమాయెను జీవితంబె- ప
ద్మాసనుఁ డేలచేసె నిది మంచికొ చెడ్డకొ చెప్పశక్యమే !

ఎందఱి పుట్టుకుంకల భరించి కృశించెను భారతమ్ము- వా
రందఱు సీతవోలె హృదయంబుల నన్నిటి చూఱలాడిరే
యందఱుఁ దల్లిదండ్రులకు నత్తకుమామకు నోటనాల్కలే
యందఱు వాయుభుక్కులయి యబ్దము లిన్ని మనంగఁజాలిరే

ఇనుఁ డస్తాంబుధిఁ గ్రుంకె- నంబుజము లెంతే డస్సి కన్మూసె-నిం
గిని పెన్జీకటు లాక్రమించె- శశియున్ క్షీణించి కన్పట్ట డెం
దున,యామంబులు రెండుమూఁడుజనియెన్ దుఃఖంబునంగుందుప
ద్మిని నూరార్పఁగ వేఁగుఁజుక్కపొడిచెం బీరమ్ము తోరమ్ముగా.

మీ కష్టంబులనావ సేరె దరికిన్ మీ యాత్ర సాగింపుఁ డో
శోకద్వంద్వమ! యంచునార్చెఁ గృకవాకుల్ డెందమం దాశ నే
దో కల్పించె, నినుండు ప్రాక్సుదతికిన్ తోషమ్ముఁజేకూర్చె నా
పై కోకంబులు దల్పుఁదట్టె వడి విశ్వంబెల్లఁ గన్విప్పఁగన్.



# పెనుమెత్స మహాయోగిని



## ii. భక్తిబీజము

మనసు చంచలమ్ము - నతిప్రమాథియుతము -
దృఢము - మిగుల బలీయమ్ము - దీని నిగ్ర
హమ్ము వాయునిరోధకృత్యమ్ము- దుష్క-
రమ్ము సంశయశూన్యము ప్రజల కిద్ది. (గీతా నారాయణీయము)

ఐన వైరాగ్యమార్గంబునందు సంయ
తాత్ముఁడు దగునుపాయ మభ్యాసమూని
పట్టి బధింపవచ్చు నప్పాపుమనసు
నంచుఁ దెలిపె విశ్వాచ్ఛున కచ్యుతుండు.

శ్రద్ధగలదు వాంఛించు సజ్జనపథంబె
గాని చిత్తవృత్తులభ్రాంతిఁ గట్టువడియె
బ్రహ్మమార్గంబునందుండి భ్రష్టుఁడాయె
యోగసిద్ధిపోయె నిఁక నేమున్నదన్న.

పార్థునకు దామోదరుఁడు.

అట్టి వానికి నాశనమంచు నెప్డు
డిహమునందేనిఁ బరమునందేని లేదు
పుణ్యకర్మలేగెడి లోకమునకె వారు
పోవుదురు బహువత్సరము లట నుంద్రు.

తుదిని యోగులనో శ్రీమతుల గృహంబు
నందొ శౌచ్యులందో ధీమతాన్వయంబు
నందొ జనియింతు రా యోగమందె నిలిచి
సాధనమొనర్చి గాంతురు జయము వారు.

అనుచు బోధించె అందుచే.

భూసురు నింటఁబుట్టి తన పూర్వభవమ్మునఁ – బెండ్లియాడి సం
తోసముగూర్చె భర్తకు – దనూజులు లేరను చింతలేక న
భ్యాసమొనర్చె యోగమును–బ్రహ్మపరిజ్ఞతనందె కొంత– నా
పై సరిపోయె నాయు విట బ్రహ్మయు నింట జనింప సీతకున్.

మూఁడువంతుల యోగమ్ము పూర్తియౌట
కల్లకపటమెఱుఁగని విఖ్యాతశౌచి
బ్రహ్మయుండౌట– నతిథి నభ్యాగతుల య
జించుటన్ సీత కీ పునస్సృష్టి గలిగె.

చూడఁగఁ గమ్మవారలు రజోగుణసంభవు – లా రజోగుణం
బేడుగడౌను కామమున కియ్యది పెంచెడు క్రోధలోభముల్
మూఁడునుగూడి మానవుల మూర్ఖులఁజేసెడి – నెవ్వరైనఁ బో
రాడఁగలేరు వీని, నటులౌటను సీత కృశించి క్రుంగెడున్.

"ధవుఁ డస్తంగతుడయ్యె – సీత కిక వైధవ్యంబెగా – పద్మసం
భవువ్రాతల్ దెలియంగ శక్యమె – యిఁకన్ బాంధవ్య మేరీతిగా
నవలోకించునొ యీమె జీవితము–సాధ్యంబో యసాధ్యంబొ–తె
ల్ప వశంబేమియుఁగాదు–చూడవలె ప్రాప్తంబెట్లురానున్నదో!"

అనుచుం బెక్కురు పెక్కురీతుల నుపన్యాసంబుఁ గావింప మా
నిని యోచించెను—పైని దారి యెదియున్ లేదాయె—దుఃఖించుచున్
దినముల్ పుచ్చుటొ-యోగమార్గమున ముక్తిం జెందుటో—ఆత్మహ
త్యను దేహమ్మును వీడుటో—తుదిది సత్యంబౌచుఁ గన్పట్టెడిన్.

దినముల్ వారములు న్నెలల్ గడిచె, నెందే దారి గన్పింపదా
యెను, పానీయముగూడ రోఁతయయి పోయెన్, దేహమెల్లన్ గృశిం
చెను, బ్రాణమ్ములు పోవుటొండె నిలిచెన్, చింతావిశీర్ణాత్మతన్
జనమెల్లన్ విలపింపసాగెను మహాసాధ్వీన్ విలోకించుచున్.

ఆమె తలిదండ్రులు

అట్టియెడన్ బెనుమెత్తను
దొట్టిన యొక దండమూడి తోయజబంధున్
బట్టిరి పూర్ణయచోదరి
గట్టి యతండౌట జనులు గారవమిడుటన్.

ఆతనిఁ దోడితెచ్చి గలయంశము బ్రహ్మయ విప్పి చెప్పి చే
యూఁతను గోర, జ్ఞాని యతఁ డూఁకొనె—తండ్రి నినూరడించి — పై
సీతను జేరి— "తల్లి! కడు చిన్నవు చెట్టతనమ్ము వచ్చె నీ
చేఁతను గాని చేత యిది చేసెడిదేమియు లేదు దీనిపై."

"పూఁత మెఱుంగువంటి తనువున్ గృశియింపగఁ జేసి నీవు వి
ఖ్యాతినిఁ గన్న వంశమిటు లారడిపుచ్చుట చెల్లునమ్మ! సం
పూతగృహమ్ము నీకొఱకుఁ బొక్కుచునున్నది — త్రోసివేయకీ
తాత యేదో వచించెనని తల్లినిఁ దండ్రినిఁ జూచి యోర్వవిమా.

జన్మమెత్తినవానికిఁ జావు ధ్రువము
చావునందినవానికి జన్మ తిరము
రెండు నివి యనివార్యమై యుండునమ్మ
వగపుచెందుట వీనికై తగదుతగదు.

పుట్టునకు ముందె మృతిఁగూర్చి భూతతతికి
మూఁడు పంక్తుల వ్రాసియున్నాఁడు నొసట
నెన్నఁడో బ్రహ్మ - భర్త గతించి మరల
బ్రతికి వచ్చునె నీ వెంత వగచుచున్న.

ఒక సావిత్రి గతించినట్టి పతికై యుగ్రాటవిం బ్రేతనా
యకుఁ గీర్తించి జయించెనందు రది సాధ్యంబైన; నే కాంత భ
ర్తకుఁ గాఁపుండదు - దీనిలోనఁ గల సత్యాసత్యముల్ సుంత నీ
విక యోచింపుము చచ్చిపోయిన నరుండెవ్వండు రాఁ డమ్మరో.

మోహమునఁ జిక్కి మానవబుద్ధి యిటుల
వగచునేగాని చచ్చినవానిఁగూర్చి
చావనట్టివాని గుఱించి ప్రాజ్ఞఁ డెవఁడు
నుంత యోచింపఁ డిసుమంత చింతపడఁడు.

తొంటి పుట్టువలందలి దురితమెల్ల
కర్మయందురు దానిఁ బోకార్ప లేము
అంతియేగాదు దాని నీ వనుభవింప
వలయు, ప్రారబ్ధపుం గర్మఫలముపేర.

శాశ్వత మెవ్వరమ్మ! యనుజన్మలు దల్లియుఁ దండ్రి నీవు నీ
విశ్వము వీడిపోవలయు - వెంటను రా రెవరైన - బుద్బుదం
బీశ్వరసృష్టియే - యిటు తపింపగఁ జెల్లదు - మానవాళికిన్
శాశ్వతమొక్కటే- పరము- సాధనచేయుము దాని నందఁగన్.

నీవ యనిత్యమైనపుడు నీ పతిమాటఁ దలంపనేల పోవునా
డీవెవరో యతం డెవఁడొ యెవ్వరెఱుంగరు-మిథ్య సర్వ మీ
భావలయమ్ము మిథ్య-యిఁకఁ బుట్టువుగూర్చియుమిత్తిగూర్చిసం
భావనసేయుమమ్మ- గల మాయ సమస్త మెఱుంగనాయెడిన్.

మానవుఁడా సిన్ను పుట్టంబు మాని వేఱు
క్రొత్తవస్త్రమున్ ధరియించుకొనిడి రీతి
దేహి శిథిలమైపోయిన దేహమూడ్చి
యన్యమౌ నూత్నకాయంబు నందుచుండు.

ఆత్మ, ప్రాణి, దేహి యన్నవన్ని యొకండ
ఆత్మ శాశ్వత మ్మనాది యవ్య
య మవినాశనమ్ము నప్రమాణ మజ మ
వ్యక్త మది యచింత్యమౌను తల్లి.

పూర్వజన్మకర్మము గ్రహింపనేరక
విధినిఁ దిట్టుటెల్ల వెఱ్ఱితనము
చెడ్డకర్మసేయ సిద్ధించు దుఃఖమ్ము
కర్మ మంచిదైనఁ గలుగు సుఖము.

వెతలంబెట్టెడి పూర్వకర్మజఫలంబే జీవి నెవ్వేళ - స
ద్గతులం గోరెడువారు నేర్వవలె నాత్మజ్ఞాన మాధ్యాత్మికో
న్నతమార్గంబునబోయి కర్మఫలమున్ సర్వంబుఁ బోకార్ప నా
పతికై కుందినయంతనే ఫలము సంప్రాప్తమ్ము గాదమ్మరో!

అనుచు స్మ్రుతుల ధర్మవాక్యముల నత్యున్నత్యమార్గంబు లె
ల్లను బోధించుచుఁ బోవఁబోవ నొకకాలంబందు గొంతెత్తిమె
ల్లన సీతాంబిక పృచ్ఛసేసెఁ-దనకున్ లభ్యంబె యాధ్యాత్మికం
బని-పూర్ణాఖ్యుఁడు దాన నౌననియె నానందాబ్ధి నోలాడుచున్.

అనంతర మా చౌదరిశ్రేష్ఠుఁ డొకదివ్యంబైన మహూర్త మాలోచించి, సకలబాంధవజననీజనకసోదరుల నాశీనులంజేసి, యిష్టదేవతాప్రార్థనానంతరమున సీతమ్మ నుద్దేశించి యిట్టులనియె-మాయామేయజగంబున నవ్విరించి సృష్టించిన జీవరాసు లెల్లను బదినాల్గులక్షల విధంబులు, స్వల్పాతిస్వల్పంబులగు క్రిములును, దీర్ఘకాయములగు తిమితిమింగిలములు మహాకాయములగు దంతావళోష్ట్రంబులు సాత్వికములైన కురంగాదులు భీకరంబులగు వ్యాఘ్రపంచాననశరభంబులు వాయుచర భూచర జలచరంబు లెన్నెన్నొ కలవు. ఇవియన్నియు నుదర పోషణార్థంబులు కామోపేతములు - దివ్యజ్ఞానశూన్యములు మానవు లాధ్యాత్మికజ్ఞానలాభంబున నన్నిటికన్న మిన్నలు.

జ్ఞానములేని మానవుఁడు జంతుసమానుఁడు- భాగ్యభోగ్యసం
తానధనాదులేవియును దా మరణించిననాఁడు వెంటరా
వీ నిజముం గ్రహించి మదినెప్పుడు సత్కృతులందు నిల్పి వి
జ్ఞానసమార్జనాహుతులఁ గాయము వ్రేల్పగనౌ సహోదరీ!

అవకాశం బిసుమంతయుండదు విరోధావేశముల్ మెంచు మా
నవజాతిన్, క్రమమైనమార్గమున జ్ఞానంబంది నారాయణున్
స్తవముంజేయుచు నిత్యకృత్యముల సన్మార్గంబునం బోవుచో
నెవఁడైనన్ గడియించు బ్రహ్మపథ మింతేచెప్పు వేదంబులున్.

పరమార్థనసాధనం గాలంబుఁబుచ్చక క్షణభంగురములైన కామమోహాలోభంబులం జిక్కి తమ్ముఁ దా ముద్ధరించుకొనలేని మానవు లధఃపతితులై యీ యిహంబుననో నరకంబుననో పూర్వజన్మ దుష్కృతఫలితంబుల ననుభవించుచు మరల మరల జనించుచు మరణించుచు కాలచక్రంబున పరిభ్రమించుచుందురు. అట్లుగాక సత్కర్మల నాచరించుచు నిరంతర భగవద్ధ్యానంబున సంతృప్తినందుచు నవకాశంబున్నపుడెల్ల నిజాత్మం దెలియఁబ్రయత్నింపుము.

ఆత్మయందున సంతుష్టి, యాత్మయందె
తృప్తి, యాత్మయందె నిరతి నందవలయు.
ఆత్మ నుద్ధరింపవలయు నాత్మచేత
ఆత్మ నశియించుచుండ నీ వరయరాదు
అత్మయే బంధువగు నాత్మ - కట్టియాత్మ
యే విరోధియు నౌ నాత్మ కెప్పుడైన. గీ. నా.

కావున.

ఎవని యాత్మచే నాత్మ జయింపఁబడునో
వానియాత్మయే యవ్వానిబంధువగు - న
నాత్మునకు వాని "యాత్మయే యహితునటుల
వఱలు చుండును వైరిభావంబుసూని. గీ. నా.

అల్పబుద్ధి కాత్మజ్ఞాన మవగాహనమగునా యని భయ విహ్వాలచిత్తవుగాకుము. సూక్ష్మబుద్ధి నీకును నాకు నెల్లరకుం గలదు గాని దానిఁ దెలిసికొని యుపయోగించుట దుష్కరము. పూర్వజన్మసుకృతమున నా ఘనశక్తి నీయందు లీనమై నిద్రాణమై యున్నయది. దాని మేల్కొల్పుము. బుద్ధిని వికసింపఁ జేయుము. నేను పాపిని హీనురాలనని దుఃఖించి నిరాశనందుట, నీయాత్మ యనంత మజరామరణము శుద్ధమని తెలిసికొనలేక పొరపడుటయే. అదియే దుఃఖమునకు మూలకారణము. ఈ నిరాశవీడి యనిత్యము లస్థిరములగు ద్వంద్వములచే గట్టువడక యాద్యంతరహితమగు బ్రహ్మానందమునకై దీక్ష వహింపుము. ఈ పరబ్రహ్మము సర్వ కీటక పక్షి జంతు మానవులయందును గలఁడు. దానిఁ దెలియుట దుష్కరమే! మోక్షాసక్తితో శ్రద్ధాభక్తులతో, వినయవిధేయతలతో కృషి సల్పినఁ దెలియఁ గలవు. ఆ కృషియే దైవసాధనము. అదియే భక్తి. దాని మార్గమే భక్తియోగము. అందు నిమగ్నవగుము. మోక్షమును సాధింపుము. ధన్యవయ్యెదవు. పురుషోత్తమునిఁ జేరెదవు. అదియే యాత్మపరమాత్మైక్యము. అదియే అద్వైతమందలి కీలకము.

ధర "శరీరమాద్యం ఖలు ధర్మసాధ
న" మను నార్యోక్తి నెంచి మానవుఁ డెవండు
దేహము కృశింపఁజేయఁ డిదియ యిహపర
సాధనకు మూలమాట ప్రశస్తమాట.

దేహమె మూలకారణము దేహికి బ్రహ్మపదమ్ము సేర - సం
దేహములేదు-చూడవలె దేహము శుభ్రతనుండ - భక్తియున్
దాహములెల్లఁ దీర్పవలె- ద్వంద్వములందునఁ జిక్కనీక "యే
కోహరి" దైవమంచు ననుకొన్న శుభంబగు, పీడుకర్మముల్.

ఇన్నిలక్షల జీవరాసుల వీడి యుత్తమ మానవజన్మమెత్తిన
ఫలము కాలమింక వృథాపుచ్చక సంసారదుఃఖముల దూర
మొనర్చి సర్వకల్యాణసంధాయిలో నైక్యమందుటయే.

ఇటుల హితోపదేశముల నెన్నొవచించి - యనంతభక్తసం
ఘటనల ముచ్చటించి కుతుకంబొనరించ-గతించెఁ గొన్ని,నా
ళ్లటుపయి సీతయున్ మఱచె నాత్మమనోహర మృత్యుదుఃఖమున్
కటకట యన్నవారల మొగంబున సంతస ముయ్యెలూఁగఁగన్.

ఒక యేకాదశి పూర్ణయాహ్వయుఁడు దివ్యోద్దేశముంజెప్పి సీ
తకు నందించెను తెల్లకాగితపు పొత్తంబున్ మషీలేఖినిన్
ప్రకటించెం రఘురామకోటి లిఖియింపన్ దాని 'భద్రాఖ్యకొం
డకుఁ' జేకొంచును పోయి రామునకుఁ గాన్కంబెట్ట సద్భక్తితో.

యోచించెన్ మది సీత యొక్కనిముసం,బూకొట్టెఁ గావింప, నా
హాచాతుర్యముపూర్ణయాహ్వయునిదే యంచున్మదిన్మెచ్చె, యా
లోచించెన్ దన భావికార్యమును కేల్మోడ్చెన్ గురుండంచు పూ
ర్ణాచార్యుం దలపోసి వ్రాయఁగడఁగెన్ రామాఖ్య వేల్వెలుగన్.

సీతారాముఁడు దన పతి
సీతారామైక్యమంద – చేత లిఖించెన్
సీతారాముల నామము
పూతంబాయెను భవమ్ము పూర్వసుకృతిచే.

కనువిప్పి చూచెనా కనుపించు మునుముందు
జానకీరాముల జంటయొకటె
కనుమూసెనో సుంత కలలోనఁ బ్రత్యక్ష
మగును సీతారామ యుగ మొకండె
పాత్రంబువిప్పెనా పొడచూపు దానిలో
జానకీరాము నిజాంశ మొకఁడె
సుంతయోచించెనా చూపట్టు లిఖితమై
జానకీరాముల చరిత మొండె

పూజకై పుష్పసంపత్తిఁ బోవ్రసేయ
జానకీరామచంద్రులే కానుపింత్రు
ధ్యానమందున రాముఁడే గానమందు
రాముఁడే యన్నియెడలను రామమయమె.

1945 క్రీస్తుశకవత్సరమున వ్రాతముగించి రామకోటితో బంధుకోటి తన్ను వెన్నంటిరా బండ్లపై భద్రాద్రికిఁ బ్రయాణమాయె.

అట సని కాంచె రాముని – మహాఋషివందిత దివ్యనామునిన్
కుటిలదురంతదానవప్రకోపిత భీముని – దుర్నివార సం
పుట జయరామునిన్ భవవిమోచన సోముని– పూర్వజన్మ సం
ఘటన విలుంఠనోద్భవితకాముని – సద్గుణసౌధధామునిన్.

కాంచి నమస్కరించి, కుతుకమ్మునఁదెచ్చిన రామకోటి పూ
జించి పదాంబుజమ్ములఁ – భజించెఁ బురాకృతకర్మ వీడ – సే
వించెను కొన్నినాళ్లచటివింతల కాలము వెళ్లఁబుచ్చి యే
తెంచె కుటుంబమెల్ల జనుదేరగ వెంటను రామభక్తుడై.

ఐహికభాగ్యభోగములు సాంతములన్న విరక్తి – శూన్య మీ
దేహమటన్న సూక్తి – హరిదేవుఁడ యేనగడన్న భక్తి–లోకస
మ్మోహవిశీర్ణశక్తి – భవమూల విలుంఠనకారణానుర
క్తిహితయోగభక్తి – వెలిఁగించె హృదంతరమందు జ్ఞానమున్.

భక్తిపారవశ్యమ్మునఁ బాయుచుండు
నప్పుడప్పుడు బాహ్యస్మృతి – యంతలోన
స్మృతికి వచ్చి రామా యంచుఁ జీరుచుండు
పతినో, భద్రాద్రిరామునో – బైటపడదు.

గంగాసంగమ మీసడించి, యమునాకౌటిల్యమున్ రోసి, యు
ప్పొంగన్ లేని సరస్వతిన్ విడచి – పోపొమ్మంచుఁ గావేరి చెం
పంగో ట్టేడిచి బ్రహ్మపుత్ర నొకత్రేవన్ – గౌతమిం జెండి – కృ
ష్ణాంగోన్నత్యముగూడదు సాగరుఁడు హంసల్ దీవి సౌధమ్ములన్.

కృష్ణాసాగరసంగమస్థలి మహాక్షేత్రమ్ముఁ గావించె శ్రీ
విష్ణుం, డయ్యెడ కేగుదేర నదియొప్పెన్ వేణుగోపాలుఁడౌ
కృష్ణస్వామి పవిత్రతీర్థమగుచున్ - క్రీడింప హంసంబు ల
త్యుష్ణాహస్సుల హంసదీవియయి సొంపుం గీర్తి క్షేత్రంబటన్.

సీతమ సంగమస్థలినిఁజేరి జలమ్ముల గ్రుంకులాడి సం
ప్రీతి నమస్కృతుల్ సలిపి - విష్ణుపదాబ్జములందు నిల్పి సం
పూతహృదంబుజమ్ము - నడిప్రొద్దొకయింతయొఱంగు వేళ తా
మాతనుగూడిచేరె తన మందిరమున్ ముదితాంతరంగయై.

నోముల నోఁచె నెన్నియొ వినూత్నవ్రతంబుల సల్పె నెన్నియో
భూమిగలట్టి తీర్థముల పుణ్యపదంబులఁ జూఁచె నెన్నియో
నేమియుఁ దృప్తిగాదు - ముదమెవ్వియుఁ గూర్పవు-చెప్పలేని దే
దో మది కల్తవెట్టిడిని తోఁపదు మార్గ మెదాత్మశాంతికై.

శ్రీ

# పెనుమెత్స మహాయోగిని

## iii. బాలయోగిని

ఎనిమిది వత్సరంబులు గతించె ధవుం డిహముందొలంగి – రా
ముని భజియించి భద్రగిరిం బూరితియాయె వసంతయుగ్మ–మా
తనువొనరింపఁగల్గిన వ్రతమ్ములు నోములు పూజ లెన్నియో
దినములు సేసె; సీత కవి దృష్టిని గూర్పవు హేతువేమియో.

వ్రతములు పూజలున్ నరు పురాకృతకర్మల బూదిసేయు – స
త్కృతులకుఁ ద్రోవఁజూపు–గలతీర్థములెల్లను గ్రుంక నవ్వి యా
పతితుల నుద్ధరించును – భవంబు దొలంగునె దాన – గానిచో
గతియెదియంచులోఁదలఁచిగాంచెభవాంతముయోగమందునన్.

ఆపయిఁ దండ్రిఁ జేరి తన యాశయమున్ వివరింప సీత – హే
లాపురిఁజేరి కమ్ములకులప్రభు నప్పన నామధేయు న
ధ్యాపకు యోగమార్గ నిశితామలధీనిధిఁగాంచి తెల్ప సం
తాపము గల్గునట్లు పరితప్తుఁడు బ్రహ్మయ బిడ్డకోరికన్.

వల్లె యని యొప్పి యప్పనాహ్వయుఁడు సేరె
బ్రహ్మయునితోడ పెన్మెత్స పల్లెటూరు
ఆంధ్రదేశంబునన్ కృష్ణయందు దివ్య
మైన దివిసీమ భోగ్యభోగ్యముల భామ.

క్రీ. శ. 1947 సంవత్సరమున నధ్యాపకుండు.

మంచి దినంబొక్కటి పరి
కించి, వినాయకుఁ దలంచి కేల్మోడ్చి ప్రారం
భించెను యమనియమముల గు
ఱించి యువియోగశాస్త్ర శిక్షణము లగుటన్.

యోగ మననేమి? అది దేని కుపకరించు?
దాని మార్గంబులెన్ని! సాధ్యమెట్లు మనకు!
నన్న ప్రశ్నంబు లుద్భవమాయెను పెక్కు
ర, కవి స్పష్టంబు యోగశాస్త్రంబునందు.

చిత్తవృత్తి నిరోధమ్ముం జెప్పినాండు
యోగమంచు పతంజలి – యోగమన్న
కర్మలెల్లఁగావించెడి కౌశలమ్ము
నఖిలమందు సమత్వమంచనియె గీత.

ఆత్మ పరమాత్మయందు నైక్యమ్ము సేసి
భవవిమోచనమందుటే ఫలము – యోగ
మార్గములయుందు ధ్యానకర్మ హఠ భక్తి
సాంఖ్యముల పేర నివి నీకు సాధ్యమమ్మ.

చిన్నతనంబు నీది – సయిచెప్పిన యోగపథంబులందు న
త్యున్నతమైన సాంఖ్య మతిదుష్కర మాచరణమ్మునందు–నే
మున్ను ప్రవేశమిత్తు దినమున్ హఠయోగమునందు నీకు – పై
నన్నియు నేర్వవచ్చును యమాదివిధంబుల నాలకింపుమీ..

యమ నియమాసన ప్రాణాయామప్రత్యాహార ధారణ ధ్యాన సమాధు లనుపేర యోగాంగము లెన్మిది – వానియందు.

సత్య మస్తేయము దయశౌచంబు బ్రహ్మ
చర్య మార్జవము మితభోజనము ధైర్య
ము, క్షమ మపరిగ్రహ మహింస మున్నగు యమ
ముల ననుసరింపవలయు యోగులు సతమ్ము.

వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణ విత్త మానభంగమందు
శుక్రనీతి దాటి శుద్ధసత్యమె గోరి
పలుకవలయు నిజమె – పలుకవలయు.

ఆటపాటలనేని హాస్యమునకేని
క్షుత్తు బాధించినంగాని, చుట్టుముట్టు
నప్పువారకిగాని ప్రాణావసరము
నందెగాని యెవ్వేళ చౌర్యంబు దగదు.

చీమలైనను సర్పవృశ్చికములైన
మృగములైన శార్దూలాది మృగములైన
పౌరులేమైన ఖలులైన చోరులైన
దయకుఁబాత్రులు యోగి నిర్దయుఁడుగాఁడు.

బాహ్యశౌచ మంతశ్శుచిత్వ మని రెండు
గతులు, వాన - శౌచము కాల్యకరణనిర్వ
హణము, పరిశుభ్రవస్త్రధారణము బాహ్య
శౌచ మంతశ్శుచ్యాస్తిక్యసమత యుగము.

మనసుచే వాక్కుచే కాయమునను గాని
సతుల పూరుషున్ పురుషుల సతులు గోర
కుండుటయ బ్రహ్మచర్యంబు - యోగమునకు
వారి యారోగ్యమునకు నాధార మదియ.

వైరియేమైన హితుఁడైన భార్యయైన
తల్లియయిన సుతులయిన తండ్రియైన
పాపియైన సద్గుణ పుణ్యవంతుఁడైన
సమత నెల్లరిఁజూడ నార్జవము తల్లి !

సాధుసుహృదయ పాపిష్ఠిజనములందు
నర్వ్యుదాసీనమధ్యస్థులందు మిత్ర
బాంధవులయందు ద్వేషులౌ వారియందు
సమతనుండుట యొండె యార్జవము తల్లి.

మెండుగా భుజియించెడి తిండిపోతు
తిండిలేక ముప్పొద్దుపస్తుండువాఁడు
పవలు రేయి నిద్రించెడివాఁడు - సతము
మేలుకొనువాఁడు యోగి గాఁజాలఁడమ్మ.

కోరికలెల్ల ద్రుంచి సమకూరినదానను దృప్తినంది యా
హారము రెండుభాగములు నాఁయి నీరము నొక్కవంతుగా
జేరిచి యొక్కవంతెదియుఁజేర్పక భోజనమందుచో - మితా
హారముగా వచింత్రు మునులందఱు - నియ్యది యాచరింపుమీ.

అన్నిటికన్న ముఖ్యమగునట్టి దహింస - జనంబు లెవ్వరే
నున్నను నిన్ను వారికి భయంబొనగూర్పగ - తిట్టి కొట్టి యా
పన్నుల సేయఁబోక - పశుపక్షుల మానవకీటకంబు లెం
దున్న దయార్ద్రబుద్ధి నవలోకనసేయగఁజెల్లు యోగికిన్.

సౌఖ్యమేమైన మిగుల కష్టంబెమైన
కరడుగట్టెడి చలియైన గాడ్పయైన
ఘోరమృగసన్నిధినయిన కొండనైన
సల్పవలె ధృతి, యోగసాధనము తల్లి!

ఇతరు లిచ్చుదాని పరిగ్రహింపరాదు
తానె యాచించి గైకొన్నదానినైన
వలసినంత యనుభవింపవలయు దాని
కధికమైన చౌర్యము పరిగ్రహము కాదు.

యోగసాధనమందు మహోన్నతగుణ
ము క్షమ, బాధలు కష్టముల్ పోరు లెన్నొ
వచ్చుచుండు బాహ్యాంతర వైరిసమితి
నుండి - యోర్పులేమి విజయ ముండదమ్మ.

ఇంకఁ బదినియమముల వచింతు వినుము
తపము జపము సంతోషము దానము మతి
వ్రతము సిద్ధాంతవాక్యశ్రవణము లజ్జ
యీశ్వరుని పూజ యాస్తిక్య మివియ తల్లి.

సాత్త్వికము రాజసము తామసమ్మటంచు
తపసునుంగూర్చి మూఁడువిధాలఁ బల్కె
గీత వేదోక్తకర్మలచేత నీదు
తనువు కృశియింపఁజేయుటే తపమనంగ.

అదియు శారీరికము వాఙ్మయంబు మాన
సికము నా మూఁడురీతులఁ జెప్పుచుంద్రు
బ్రహ్మచర్యము శుచి ఋజువర్తనమ్ము
దైవపూజ శారీరిక తపము తల్లి.

వేదవేదాంగపఠన ముద్వేగరహిత
మయిన సత్యప్రియములు వాఙ్మయతపంబు
లాత్మనిగ్రహ మౌన సౌమ్యత్వ శుద్ధ
భావములు మానసికమౌ తపమ్ము లంద్రు.

యుక్తుఁడై ఫలమందు నాసక్తి వీడి
శ్రద్ధసేయు తపమ్మెంచె సాత్త్వికమ్ము
చంచలము నస్థిరము దంభసంయుతమ్ము
సత్కారణవాంఛితమ్ము రాజసతపమ్ము.

ఆత్మకుం బీడ చేకూర్చునట్టి పనులు
పరులకున్ హింస సమకూర్చుపనులు గట్టి
పట్టుదలచేత గావించునట్టి పనులు
తామస తపమ్ములందురు తారు మునులు.

వేదవేదాంగములనెల్ల విశ్వసించి
మంత్రపఠనమ్ము సేయుట మహితజపము -
ఏది లభియింపc దానితో దృప్తినందు
నాత్మసంతుష్టి సంతోషమంద్రు బిడ్డ! -

దానమైనను మూడువిధమ్ము లంద్రు
దేశ కాల పాత్రమ్ములc దెలిసి ప్రత్యు
పకృతిc గావింపcజాలని వారికొఱకు
సలుపు దానమ్ము నిజమైన సాత్త్వికమ్ము.

ప్రత్యుపకృతిcగోరి ఫలమ్ముc బడయనెంచి
మదిని క్లేశమ్ముతో నిచ్చునదియు రాజ
సమ్ము దేశకాలరహి తా సత్కృతావ
మానముసc జేయునదియు తామసము తల్లి.

ప్రియత వైదికక్రియల వర్తించుచు మది
నిత్యనైమిత్తికక్రియానీకములను
వేదయుక్త విధి నిషేధ విధము లెఱిcగి
వానిc గావించుచుంటయే వ్రతము తల్లి.

కల శ్రుతిస్మృతుల పురాణములను విశ్వ
సించి ఈశ్వరు నమ్మి – టాస్తిక్య, మతని
పూజఁ గావింప నీశ్వరపూజనమ్ము
యోగపుఁగొలికిపూసలై యుండు నివ్వి.

ధర్మబద్ధముగాని వ్రతములఁ గర్మ
లం బ్రవేశింప సిగ్గిల లజ్జయంద్రు
వేదవేదాంగముల్ పురాణాదు లేవి
బలుకు సిద్ధాంత కావ్యశ్రవణము లవ్వి.

వాఙ్మనఃకాయములచే నెవారు వీని
నెల్లవేళలఁ బాలింత్రు, తల్లి! వార
లచిరకాలమ్మునందె సంయములుగాఁ గ
లారు మనసు బంధింపఁగలారు తుదిని.

తల్లీ యియ్యవి యోగబీజములు శ్రద్ధన్ వీనిఁ బాటింపుచో
ముల్లోకంబుల నడ్డులేదెవరికిన్ మూనాళ్లలో యోగమే
తెల్లంబౌఁ బయి నష్టసిద్ధులును సిద్ధించున్ నశించున్ భవం
బెల్లన్ బ్రహ్మపదంబు లభ్యమగు నింకేముండు నామీఁదటన్.

అఱువదిదినాలఁ బండు ధాన్యంబు యవలు
గోధుమలు పెస లాజ్యమ్ము క్షీర దివ్య
నీరములు వెన్నయుం బంచదార తేనె
పంచశాకముల్ కలకండ. మంచిసొంటి
చేతిపొట్ల భోజ్యమ్ములు సిద్ధులకును.

పుష్టి నొసగూర్చు ధాతుప్రపోషణమ్ము
నిచ్చు మధురపదార్థముల్ స్నిగ్ధములు మ
నోభిరామరుచ్యంబులు యతికి నెందు
భోజ్యములు, దదన్యమ్ముల ముట్టరాదు.

చేఁదు కార ముప్పు పులుసు చేఁప మాంస
ముఁ బెరుఁగు మజ్జిగ తిలలు పులిసినట్టి
కసుగసునీ శ్లాకుపూరలు కల్లు రేఁగు
పండ్లు లవ లుల్లి యింగువల్ వలదు కసువు.

వండి చల్లార్చి వెండియు వండినట్టి
వంటకము లాజ్యహీనముల్ పనికిరావు
ఆళ్లు జొన్నలు నీచధాన్యమ్ములైన
నెట్టి తీక్ష్ణవస్తువులైన ముట్టరాదు.

దుష్టజనసహవాసమ్ము ధూమపాన
ము, రతి వేకువస్నానంబు నిరతమున్ ప్ర
యాణమున్ సేయుట యుపవాసాదు లెవియుఁ
బూనరాదు యోగాభ్యాసమునకు ముందు.

బుడుతఁడైనైన ముక్కాలి ముదుకఁడైన
రోగియైన దుర్బలుఁడైన యోగబుద్ధి
శ్రద్ధ నభ్యాసముంజేయ జను నటంచు
సత్యదూర మీమాట - వాస్తవము వినుము.

యువకు లారోగ్యవంతులు యోగశాస్త్ర
పరిచితుల్ నల్పదేండ్ల పైఁబడనివారు
నేర్వవలయుఁ గురుముఖతనే తదన్య
మెద్దియైనఁ గష్టమ్ములు నిడును వారి.

శాస్త్రపఠనముగాని కాషాయవస్త్ర
ధారణముగాని యోగకథనముగాని
యెవని యోగి గావింపఁబో విష్టసిద్ధి
గలుగు నీకు యోగాభ్యాసకలన నొండె.

జనసాంగత్య మధిక భో
జన మాయాస మొనగూర్చు శ్రమ చపలత్వం
బు నిశిత నియమగ్రహణం
బు నుపన్యాసములు శాత్రవులు యోగులకున్.

ప్రాతఃకాల శీతలోదకస్నానములు రాత్రిభోజనము ఏక భుక్తముపవాసము ఫలపర్ణభక్షణములు నియమగ్రహణములు యోగాభ్యాసమునకు విరోధులు.

తత్త్వమున కొంతజ్ఞాన ముత్సాహము, దృఢ
నిశ్చయము సాహసము ధైర్యనిశిత మఖిల
మనుజసంగపరిత్యాగమనిన యాఱు
నుపకరించెడి మిత్రులై యోగమందు

యోగతృతీయాంగమైన యాసనము హఠయోగప్రాధాన్యము. చతురశీత్యాసనములలో వసిష్ఠాదిమహర్షులు మత్స్యేంద్రాదియోగులు జనకాదిరాజర్షులు హర్షించినవి నాలుగు. ఈ యోగాసనాదులకు మున్ను, దానికి యోగ్యస్థానము మఠలక్షణ మాసనప్రయోజనము నెఱుంగు టావశ్యకము.

సంతతరాజ్యవైభవము చారుసుభిక్షము ధర్మరక్తి ని
శ్చింతసుమానసు పాలకుల క్షేత్రములందు ధనుఃప్రయోగప
ర్యంత శిలాగ్నినీరరహితావని గష్టములేమి లేని యే
కాంతమఠమ్మునందు మునికాండము లుండగనౌను సోదరీ.

ద్వార మొకండు చిన్నది-గవాక్షము లేనిది - యెట్టి జంతుసం
చారముగాని లేనిది - విశాలముగానిది యెత్తుపల్లముల్
చేరని నేలగల్గినది - చెంతను బావియు ముందువేది ప్రా
కారము చుట్టునున్నయదిగా మఠ ముండవలెన్ సహోదరీ.

గోమయసాంద్రలిప్తమతి గుప్తమునైన మఠమ్మునందు చిం
తామమకారశూన్యత సతంబు వసించి గురూపదేశ బో
ధామృతమార్గగామియయి తానొక యోగము నభ్యసింపనౌ
నీమముతో, దదన్యము మనీషులు సుంత దలంపరాదు సూ.

స్థైర్యాయురారోగ్యాంగలాఘవసిద్ధిలు యాసనప్రయోజనము. ఇంక చతురశీత్యాసనముల పేరులు వినుము:

స్వస్తిక, గోముఖ, వీర, కూర్మ కుక్కుటోత్తాన, ధను మత్స్యేంద్ర పశ్చిమతాన మయూర శవ సిద్ధ పద్మ సింహ భద్ర

సుఖ (మత్స్యేంద్ర మతాంతర) సిద్ధలు, అర్ధపద్మ మత్స్యేంద్ర పద్మలు, గోరక్ష స్థితోత్థితవివేకలు) స్థిరశ్రేమ (వామదక్షిణ) శాఖలు, వామదక్షిణ పానాపానగమనలు ఉత్కటి ఉత్కట బద్ధయోని పవనముక్త (మయూరక ఉత్తానమయూరకలు) వామ దక్షిణపాదపవనముక్తలు గర్భపానాపానసమాన ద్విపాద సిర భైరవ టిట్టిభ అంగుష్ఠ (వామదక్షిణాలు) కామదహన గ్రంధిభేదన (వామదక్షిణవక్రలు) వామదక్షిణజానులు మత్స్య పర్వత ప్రౌఢ కోకిల ఆనందమందిర ఖంజన వాతాయన ఖండ పీఠన పవన నిశ్వాస త్రిష్కంభ అగ్నిసార పూర్ణసార వామదక్షిణ పాదలు కపాల అర్ధముక్తహస్త హస్తనృత్యలు, ఏకపాదనృత్య తాడన, ఊర్ధ్వసంముక్తపాద ఊర్ధ్వపద్మ అధ్వజ్యేష్ఠిక శలభ ఉపధ ఉష్ట్రభుజంగ (వామదక్షిణార్ధపాదలు వామదక్షిణభుజలు వామదక్షిణసిద్ధలు వామదక్షిణహస్తచతుష్కోణలు గరుడపార్శ్వ ద్విపాదపార్శ్వ సర్వాంగాసన వామశ్వాసగమన దక్షిణశ్వాస గమన (దక్షిణపాదధీరవామపాదధీరలు దక్షిణ వామపాదపవనలు దక్షిణవామహస్తభయంకరలు [illegible]గుల్మక ఫనుమ ఊర్ధ్వదమ చక్రహంస అర్ధశవ వామహస్తభుజ దక్షిణహస్తభుజ హస్త భుజ పూర్ణపాదత్రికోణ వామత్రికోణ దక్షిణత్రికోణ దక్షిణ పాదత్రికోణ వామపాదత్రికోణ పూర్వోత్తర్క యోగనిద్ర వామ తర్కదక్షిణతర్క కూర్మ అర్ధకూర్మ ఉత్తానకూర్మ దృఢాసన దక్షిణాసన వామాసన దక్షిణచతుర్ధాంశ పాద వామ చతుర్థాంశ పాద దక్షిణపాదసిర వామపాదసిర లోలభేకనము లనునవి.

ఇందు ప్రాణాయామమునకు పద్మసిద్ధసుఖ స్వస్తికలు ముఖ్యములు.

యమనియమము లెవారలకైన సమమె
మతము సూత్ర మరణ్యసీమలను కొండ
గుహలను నదీతటమ్ములఁ గూర్చ సాధ్య
రహితమగుట నీదు గృహాంతరమున నిలిపి.

గది యొకటి నాల్గువైపుల గాలిరాని
యటుల నిర్మించి దానికి స్వల్పమార్గ
ము నొక గలుపుంచి యోగాసనము గదిమధ్య
నుంచవచ్చు, బోషాణము నుపకరించు.

ప్రథమ మందాసనముల సర్వంబు నేర్వ
వలయు రెండుదృష్టుల మూలబంధములను
దెలిసి వెనుక ప్రాణాయామ కలన మెఱుఁగ
నీ యభిమతమ్ము సాధింపనేర్తువమ్మ.

ఇటుల వచించి, యాసనము లేవిధి వేయఁగ నౌనొ చూపి కొ
న్నిటిఁ, జనె నప్పునాహ్వయుఁడు హేలను, సీతయు నభ్యసించె న
న్నిటిఁ గడుకొద్దికాలమున, నేర్చె మఱింకఁ గొన్ని-యొజ్జ యె
ప్పటివలె నేగుదేరఁ గనుపట్టె సమంచితదీక్ష సీతలో.

పలువురు గ్రామవాసులు స్వబాంధవులుం బరికింప సీత ని
శ్చలనియమంబుతోఁ దగఁ గడుఁ జక్కఁగ నిర్వదియెన్మి దాసనం
బుల నిపుణత్వమున్, గురుఁడు ముక్కున వ్రేలిడిచూడఁ జూపెఁ, గాం
తలు సహితమ్ము యోగసమతన్ మగవారికిఁ దీసిపోదు రే.

అప్పన చెప్పె నాఁడు ప్రజలందఱ ముందట సీత యోగపుం
గుప్ప-ప్రవర్తనంబు గడుగొప్ప-జయించును వెన్నుతిప్ప - యే
ముప్పును లేక సాంఖ్యపథముం బయనించెడు నెల్లరొప్ప - నె
ల్లప్పుడు దివ్యతేజమును నాహుతిసేయును చొప్పదోసముల్.

అంతియకాదు భావిఁ దనయద్భుతమైన మహత్త్వఁజూపు - దే
హాంతరమందు వెల్వడు ననన్యసుగంధవితానపంక్తి - యిం
కెంతయొ శక్తియున్నయది యీపెవశమ్మున - నీమెకింక జ
న్మాంతరమంచు లేదు మరణంబయినన్ లభియింపఁ బోదిఁకన్.

కొద్దికాలముననే యీమె సహస్రారమునుండి యమృతము మీకుఁ జూపింపఁగలదు. తల్లిదండ్రుల జన్మము ధన్యము. అని చెప్పి గురుం డేలూరున కేగె.

ఎనుబదినాలుగాసనము లెల్ల శ్రమించి గ్రహించి తాన వై
చెను బ్రజమోదమంద, నతిచిత్రమటంచును పెద్దలాడ - పెం
చిన తలిదండ్రు లాపె వగ ఛిద్రముగా బరికించి సంతసం
బును గొన, కొద్దికాలమటు బుద్బుదమట్టులనేగె నాపయిన్.

పూర్వజన్మల పాపముల్ పలాయనమయ్యె
నాఁటి సత్కృతులు మిన్నంటఁజొచ్చె
వస్తునిత్యానిత్యభావమ్ము స్ఫుటమాయె
స్వస్వరూపజ్ఞాన పరిధి మించె

మోహభయవిచారముల్ తుత్తినియలాయెఁ
బరమాత్మపై దృఢభక్తి గలిగ
సంసారపున్ మిథ్య సర్వమ్ము గన్పట్టెఁ
బతిమీఁది వగ పటాపంచలాయె

కర్మబంధములు విడినకతన, భావ
మందు నిత్యసత్సంకల్ప మబ్బుకతన
క్రోధరాగవిద్వేషముల్ గూలుకతన
దివ్యశక్తి గలుగ జ్ఞానదీపమబ్బె.

తొలిబీజంబులు పూర్ణయామాహ్వయుని సుద్దుల్–రామసంకీర్తనం
బులు లేమొల్కలు, నప్పనాఖ్యకథనంబుల్ చెట్లు యోగాసనం
బులు పత్రంబులు ప్రాణరక్షణము పూవుల్ నిర్వికల్పమ్ము కా
యలుగాఁ పండు లభించెఁ సీతమకు బ్రహ్మజ్ఞానపుం దోఁటలో.

తనివింజెందని దేహగేహమున నాత్మజ్ఞాన దీపమ్ము ని
ల్పెను పూర్ణయ్య పురాకృతాఘతమముల్ విచ్ఛిన్నమైపోయె నా
త్మ నిరాలంబ నిరూపణంబచట నాద్యంతమ్ముఁ జూపట్టె – న
ప్పన యోగాసన తైలధారలబలం బా దివ్వె వెల్గింపఁగన్.

క్రీ. శ. 1948 వ డిశంబరుమాసమున 15 వ దినంబున

సతి రంగమ్మ యిహమ్ము వీడ, నిజయోషాజ్ఞాసహార్థమ్ము దా ప్రతిసంవత్సర మెల్లరంబిలిచి విద్వత్పూజ గావించు స మ్మతి, నప్పన్న ప్రసిద్ధభక్తిమహిమన్ మన్నించి మాటాడఁగా సతి సీతమ్మను గోరె నాఁడతఁడు సత్సంకల్పమై యుండుటన్.

పశ్చిమగోదావరీమండల మాండలికేతరగ్రామములనుండి యేతేరిన గురుబంధుచ్ఛాత్రు లోకవంకను, ఆహ్వానమున నేతే రిన బ్రహ్మాయ కుటుంబబంధుమిత్రు లోకప్రక్కను, హేలా పురీ విద్వజ్జనంబు మఱియొక సభాంగణమునను నాసీనులై వీక్షింప, తత్సభామాండలికకరగ్రాహి యగ్రాసనాధిపత్యము వహింప, తత్సతీమణి నామభాగంబునను ప్రభుత్వమాండలిక వైద్యాధిపతి దక్షిణభాగమున నుండ, సభోన్నతస్థానమున నిలఁ బడి సీతమ్మ యిట్లుపన్యసింపఁ దొడఁగె.

ఓ సభాసదులార! నా యోపినంత
నే నెఱిఁగినంత వచియింతు - నేను పిన్న
దాన విద్యావిహీనను - తగిన శక్తి
లేనిదాన ప్రేమ నిది యాలింపరయ్య.

భారతదేశమెల్ల మనవార లెఱింగినదే కదా - మహా
భారత మెల్లవారలును పారణసేసినదే కదా - యిఁకె
వ్వారికి హైందవోన్నతిని భారత భక్తి గుఱించి చెప్పనౌ
తీరని భారమైన గురుదేవుని పల్కులు మీఱ శక్యమా.

రామాయణ గ్రంథరచనలో వాల్మీకి
భక్తిబీజము లుంచె భరతభూమిన
భాగవతపురాణ పఠనలో పోతన
నార్ద్రిమ్ముసేసె భక్త్యంకురములు
భద్రాద్రిరాము కైవారమ్ముపేరిట
గోపన పెంచె నా కొద్దిమొలక
ముసు గీతగోవింద మనుపేరఁ బోషించి
జయదేవుఁ డోమె వృక్షమ్ము సుంత

నారదుడు శంకరుడు కబీరు లాది
భక్తవరులెందఱో దానిఫలము గొనిరి
భక్తి నెఱుఁగని నరుఁడు విశ్వమున లేఁడు
భారతీయుఁడైన మఱి యెవ్వఁడునైన.

భక్తి పథం బతిసులభము
ముక్తి పడయ సాధనంబు మల్లోకములన్
భక్తియు నొక యోగం బా
సక్తిని సాధింపరయ్య సభ్యులు మీరల్.

యోగమార్గమ్ములన్ భక్తియోగ మొకటి
జ్ఞానమార్గమ్ము కర్మయోగమ్ము ధ్యాన
పథము హఠయోగమంచు నాపైనిగలవు
ఏదయినఁగాని ముక్తి మీకీయఁగలదు.

పలుకవలె సత్యమొక్కటె, వలదు హింస,
బ్రహ్మచర్యమ్ము సఖ్యమ్ము సరునిస్సాత్త్వ
ముట్టరాదు, చేయుండి మితభోజనమ్ము
శుచిగ నుండుడెల్లరి పెయుడజాపవలయు.

దానమీయుండి పేదసాదలకు, జపము
తపము సేయుండు సంతోషమొప్పు వలయు
దేవుడున్నాడు, లేడన్న తెగులు తగదు
విశ్వసింపవలె పురాణ వేదములను.

బాహ్యశౌచ మంతశ్శుద్ధి పట్టునపుడె
నాయురారోగ్యములుగల్గు మాయదొలగు
చివర, హఠయోగ మభ్యసించెదరయేని -
యోగమార్గమ్ము ముక్తి, వేరొండులేదు.

సంతసమొందెనిల్చునవిచారములెల్లనశించు, వీడు దే
హాంతరమందు వెల్వడు నవాబ్జసుగంధపరిమళంబు మే
ధోంతరసీమనున్న యమృతంబు స్రవించెడినోట - నన్న ని
ర్ఘాంతముతో సదస్యులు సహర్షత సద్గురి సీత నయ్యెడన్.

అంత

సీతమనుండి వెల్వడె విచిత్రసుగంధసమీరబాలసం
ఘాతము, సర్వసభ్యులకు గౌరవమంతజనించె; బై సభా
నేతకు వాయి వెల్వడు ఘనీతవినూత్నఘనామృతంబు దా
జేత నొసంగె సీతము, రుచింగని హర్షమునందె నాతడున్.

కరతాళధ్వను లెగ సం
బరమంటె, సభాధినేత బ్రహ్మానందం
బొరయఁగ సభికులతో నని
నిరుపమయా బాలయోగిని యనుచుఁ బ్రీతిన్.

జయ జయ బాలయోగిని ! విషాదవిలుంఠన కార్యదక్షిణీ !
జయజయ బాలయోగిని ! తుషారవికాసయశోవిలాసినీ !
జయఁజయ బాలయోగిని! ప్రశాంతమనోహర మోక్షదాయినీ!
జయజయ బాలయోగిని ! విశాలహృదంబుజమానినీమణీ !

అనుచు హేలాపురీ సభ్యు లఱచునంత
హర్షముం బొందె నప్పనాహ్వాయుఁడు – దల్లి
దండ్రుల సహోదరులఁ జేరి ధన్యవాద
ముల వచించి కరగ్రాహిపురికి వెడలె.

ఆపయి వచ్చుటనున్న జనములో.

పెనుమెత్న బాలయోగిని చక్కనౌ నుప
న్యాసంబుఁ గావించె ననెడివారు
మల్లికాసుమగంధ మెల్లెడ వ్యాపించె
నాపె నిల్చినచోట ననెడివారు
మెదడునందున్న యమృతము వెలికిఁదెచ్చి
యందఱి కిచ్చెనం చనెడివారు
వదనమందుండి దివ్యప్రభల్ వెల్వడఁ
గనులఁ జీకటిగ్రమ్మె ననెడివారు

అట్టి భాగ్యమ్ము మనకబ్బదనెడివారు
మనదు జన్మ సఫలమాయె ననెడివారు
పాపములు నశించె నటంచు బలుకువారు
గాఁగ నూరూర సీత ప్రఖ్యాతి యెసఁగె.



శ్రీ

# పెనుమెత్స మహాయోగిని

## iv. సదాయోగిని

సంయములకుఁగాదె సాత్వికాహారంబు
నా, రుచులెల్లఁ బోనాడవిడిచె
పేదకులేని యామోదమా తనకంచు
నేకభుక్తయగుచు నేలఁబండె
ఓకయే దైవంబు నా డయ నన్నదా
నమ్మతో వస్త్రదానమ్ము సేసె
హరి యొక్కఁడే భవహరుడంచు గీత నా
రాధించె మదిని నిరంతరమ్ము

ప్రాణములు వాయుభుక్తి నిల్వఁగలవంచు
మూఁడునాళ్లపై నొకపూఁట భోజనమ్ము
సలిపె - పయివారమున కొక్కసారి చేసె
నంత్యమందున మానె నయ్యదియుఁ గూడ.

ఫలము లొండె భుజించె నాపైని - కొంత
కాలమేఁగ నీరముల నాఁకలి నడంచె
నదియు మానెను గొన్నాళ్లపిదప - గాలి
యొండె తిండిగా జీవించుచుండెఁ దుదిని.

దిశలు పరికింపఁబోక, తదీయదృష్టి
నిలిపి నాసాగ్రమందు, నిశ్చల మొనర్చి,
మూఁడుతడులఁ బ్రాణాయామమును బొనర్ప
సాహసించెను సీతమసాధ్వి యపుడు.

చిత్తశుద్ధిని దన కుడిచేతి బొటన
వ్రేలఁ గుడిముక్కు రంధ్రమ్ము బిగియఁబట్టి
యెడమ ముక్కుబెజ్జమున గాలినెల్ల నెమ్మ
దిగను లోఁబీల్చె నూపిరితిత్తు లుబ్బ.

శక్తికొలఁది లోఁగొన్న శ్వాసమ్ము నిలిపి
పూర్వవిధి కుడిరంధ్రమ్ము బొటనవ్రేల
బిగియఁబట్టి యెడమ ముక్కుబెజ్జమునను
మెల్లమెల్లఁగ నెడలించె నెల్లగాలి.

గాలి లోనఁబీల్చుట పూరకం బటంచు
గాలి విడిచిపెట్టుట రేచకం బటంచు
గాలి లోననిలుపఁ గుంభకం బటంచు
నన్నిగూడ ప్రాణాయామ మండ్రు మునులు.

ప్రీతి, పూరక కుంభక రేచకములు
మూఁడుమాసముల్ గావించె - నాడి శుద్ధి
యయ్యె - దేహమ్ము లాఘవమయ్యె - ప్రజ్వ
రిల్లె యోగాగ్ని చిక్కె శరీరమెల్ల.

కారణజన్మ సీత; యవకాశము సిక్కెను నేఁటి కిట్లు సా
ధారణవంశమందు నవతారమునెత్తి గ్రహింప యోగపున్
సారమునెల్ల - చెడ్డయును సంభవమాయెడి మంచికన్న సం
సారులమాట నిక్కువము మానిని మానవజీవితంబునన్.

యోగసిద్ధి లభించె - వాయువు తదిష్ట
రీతి నెవ్వేళ నిలుపనేరిచె - సయి నోన
గూడె నామెకు కేవల కుంభకమ్ము
పూరకము లేక రేచకము గనరాక.

యోగపుకాలమందు నవయోగిని ముమ్మొదటన్ భరించె స్వే
దాగమ మాపయిన్ జెమటతైలమురీతిని రుద్దె దేహపున్
భాగములందు - యోగపరిపక్వదశన్ గనుపింపదాయె స్వే
దాగమ మింతయేని - జడతాల్పులకేవి యసాధ్యమా నిలన్.

వాయువు మెల్లమెల్లఁగ నపారముగా భరియింప లోన ద
త్కాయము గంపమంది వడఁకం దొడఁగెన్ విపరీతరీతి - నా
పై యతిలాఘవంబగుచుఁ బర్విడె కప్పవిధాన - నింక నా
వాయువు గొంతఁబల్చె నటుపై నెగసెన్ బులుగట్లు నింటిలో.

సర్వవిఘ్నవిదూరమ్ము సకలదోష
నాశనకర మోంకారమంత్రమ్ము - సీత
పూని కేవల కుంభకమున జపించె
ప్రతిదినమ్మును నాల్గుకాలమ్ము లందు.

## సదా యోగిని

ఇంద్రియార్థమ్ము లాసించు నింద్రియములఁ
గదలనీక, కేవల కుంభకమ్ము నందు
ప్రాణము నిడి, ప్రత్యాహారఫలము వడసె
యోగసాధన మధ్యమం దొక్కనాఁడు.

కురుమద్దాలి యటన్న గ్రామమున లోకుల్ మెచ్చ బం
దరు రస్తాయి నిల్చె నాశ్రమము - వందల్ వేలు వీక్షింప వ
త్తురు నిత్యమ్ము - తదీయదర్శనమునం దొల్లింటి పాపమ్ము లా
విరియై పోవునటంచుఁ దండ్రి కిది తెల్పెన్ సీత యుత్కంఠతో.

పంచమజాతిఁబుట్టె విభవమ్ము సమస్తము రోసి దేహపున్
వాంఛలఁ ద్రెంచి మృత్యుజననమ్ముల మిథ్య గ్రహించి భావి మో
చించి యనాథనాథుఁ నొక చిన్మయు నీశ్వరునందుఁ గాంచి కా
మించి భజించె పిచ్చనాశ్రమించి గ్రహించెను మోక్షధామమున్.

ప్రజలం జేర్చు నిరంతరం బచట శ్రీరామావధూతాఖ్య భా
వజసౌఖ్యంబులు బుద్బుదంబు లిహమప్రాశస్త్య మీ దేహమై
నజగంబందు నశాశ్వతంబ యొక మూనాళ్లైన జీవింపఁబో
దు జనం బివ్వి దలంచి యుబ్బదగునా ధూర్తాత్ములం చాడెడిన్

ఎందఱో భూమిదేవులు మఱెందఱో క్షత్రియ వైశ్య శూద్రు లిం
కెందఱో రైతుబిడ్డలు భజింపగ, నున్నతరాజసేవకుల్
కొందఱు నిత్యదర్శనము గోరి వసింపఁగ, దేవదూత యం
చందఱుఁ బల్కఁ బిచ్చమ యహర్నిశలుం బ్రజ దిద్దు నచ్చటన్

ఏనాఁకసారిపోయి జగదీశ్వరి పిచ్చమఁ జూచినత్తు - నే
నైనస గురూపదేశమని యామె వచించిన దాని శీర్షమం
దూని మదీయజీవితము యోగసుధమ్మున నంతు - దివ్యమా
ర్గానలమందు పాపనిచయంబు సమస్తము బూదిసేసెదన్.

అనుచు బాలయోగిని స్వీయ జనకుతోడఁ
బలికె - నంతగృహిణిఁ గొంచు బ్రహ్మయాహ్వా
యుండు సేర్చెను సీతమ బండిలోన
నేశ్రమయు లేకయే పిచ్చమాశ్రమంబు.

డాబాయొక్కటి దానిపైని గది గోడల్ లేకయే దొడ్డి యం
దే బీరమ్మనులేని ఛాత్రులు సదానిర్వస్త్రులై వారికే
దో బోధించుచు నున్న తాసనమునం దున్నట్టి వృద్ధావధూ
తా బాలాంబిక గాంచి సీత పదపద్మంబందు వ్రాలెన్ వెసన్.

అచ్చెరువందె పిచ్చమ - ముఖాంచిత దివ్యవినూత్న కాంతికిన్,
మెచ్చె దదీయనిష్ఠకు, నిమీలిత దివ్యదయార్ద్రదృష్టికిన్
ముచ్చెమటల్ జనించె,నరమోడ్పు కనుంగవ హర్షబాష్పముల్
హెచ్చె,ప్రకంపితాంగ యయి యేమొ వచించెను సీతమెల్లగన్.

దివ్యసమాధినున్న పరదేవత మెల్లగఁ గన్నువిచ్చి వా
స్తవ్య కథావిధాన ఫలితమ్ము నెఱింగి వచించె "బిడ్డ! సం
స్తవ్యము నీదుమార్గము విషాదకుతారము ముక్తిమార్గ సం
ఛావ్యము పూర్వపాతకనివారణమార్గము జన్మశూన్యమున్.

వదలఁగఁబోకుమమ్మ యిది పండినవారలకు న్లభింపఁబో
నిది సులభమ్మగాఁ దొఱికె నీకు సమాధిని గోరివచ్చి తీ
వదియు లభించు సత్వరమె-యైన మదాశ్రమమందు నుండి కొ
న్నిదినము లద్దిసేయఁదగునే తనయా! నవబాల యోగినీ.

పండెను నీదుజన్మ మిఁక భావిభవంబులు లేవు నీకు – నీ
వుండిన యిల్లు వీడి యటనున్న మహోత్క-గృహంబునందు వే
ఱొండుగదిన్ సృజించి యటనుండుము యోగసమాధియందు బ్ర
హ్మాండము విచ్చినన్ గనుల నయ్యదిచూడకు మేలుగల్గెడిన్.

నా యుపదేశమును గొంత వినుము. మనస్సు కామ క్రోధ లోభ మోహమదమాత్సర్యాది షడ్గుణంబులఁ జిక్కి దుఃఖ మయభోగంబుల సుఖంబులుగా భావించి సంసారసముద్రమునఁ బడి యజ్ఞానముచేఁ గప్పఁబడి పుణ్యపాపములఁ జిక్కి స్వర్గ నరకంబు లనుభవించి పునర్జన్మమునందుచున్నది. అట్టిదాని నీ వరికట్టితివి. ఆ మనస్సు బ్రహ్మనిష్ఠయందు సంకల్పశూన్యఁజేసిన బ్రహ్మానందమందఁగలవు. అదియే ముక్తి. రాజయోగి బ్రహ్మ జ్ఞాని మనస్సంకల్పముల విడచి నిర్వికల్పముల బొందనంత వఱకు బ్రహ్మనిష్ఠ నభ్యసింపవలయు. శాస్త్రాభ్యాసమున బ్రహ్మజ్ఞానము రాదు. అది బ్రాహ్మణత్వమున సిద్ధించును. బ్రాహ్మణత్వమన్న అరిషడ్వర్గ నాశనము. ఇంద్రియనిగ్రహణము. నిరాశ. శాంతి. శ్రద్ధ. విశ్వాసము. శమదమాది షడ్గుణసంపత్తి. ఆత్మస్వరూపము. అహంకారరహితము. జన్మము – బ్రాహ్మ

ణునిఁ జేయదు. హారమునందలి దారమువలె పరమాత్మ యన్ని జీవుల హృదయమందునున్నాఁడు. అదియే పరమసూత్రము. యజ్ఞోపవీతము. ఈసూత్రమే గురుముఖతః నెఱుఁగఁదగినది. ఇది పరమరహస్యము. పరమ గోప్యము. దీనిఁదెలిసి యభ్యాస మొనర్పుము. ఇదియే సంప్రజ్ఞాతసమాధి లేక సవికల్పసమాధి. ఉచితరీతి మఠముస్థాపించి యొకపున్నమనాఁటిరేయి 7గంటలకు పద్మాసనమున గురూపదేశమును భ్రూకుటి నిలిపి దేహప్రాణధన ముల గురునకర్పించి చిన్ముద్ర సోఽహమ్మను మంత్రముతో ప్రాణాయామ మొనర్పుము. కొంత యభ్యాసానంతరము మం త్రము నిలిచిపోవును. అపుడు నీవు అసంప్రజ్ఞాతసమాధి యను నిర్వికల్పసమాధిఁ బ్రవేశింతువు.–'సోఽహం'మంత్రము మఱచి మనోబుద్ధుల బంధించి సర్వమును మఱచి మనస్సును బ్రహ్మ మందు లయించి తానే తానయి, తన్మయుఁడై కేవల చిన్మ యుండై సాక్షీమాత్రముగా నుండుట నిర్వికల్పమను అసం ప్రజ్ఞాత సమాధి. చిత్తవృత్తు లాఁగియున్నను తత్త్వనిజస్థితి యెఱుఁగుసంకల్పమున్న సవికల్పము (సమాధి) అది లేకున్న నిర్వికల్పము. అపుడు బ్రహ్మసాక్షాత్కారమగును. బ్రహ్మైక్య మగును. బ్రహ్మతో నీకు భేదముండదు. సంకల్ప వికల్ప శూన్యమగును. బిడ్డా! పోయిరమ్మ.

అనుచు భావిఁ దెల్పిన పిచ్చమావధూత
కొక నమస్కారము నిడి గురూపదేశ
మంది యచటి యోగవిధాన మరసి సీత
చనియె నింటికి నామె దీవనలఁ గొంచు.

శ్రీరామ సేవికాశీర్వాద మొక దృఢ
సంకల్పమౌచుఁ బ్రోత్సాహ మొసఁగ
మలమూత్ర శూన్య మాఁకలి సుంత లేమియు
నన్నియామముల సాహాయ్యమిడఁగఁ
గోరి చేయించిన దారు బోషాణంపు
టునికి యోగాభ్యాస మినుమడింప
కృతనిశ్చయం బతిదృఢతర వైరాగ్య
మాత్మసంయమము సాయమ్ముసేయ

సుజ్జ్వలమగు ప్రాణాయామ మూని నాల్గు
మాసములు సవికల్పసమాధి నుండె
చలనరహిత కటిప్రదేశంబు గాయ
పడియెఁ జీమలందుఁ దమి నల్గడలఁ దిరిగె.

దేహమందలి గాయాల దృష్టిలేదు
పట్టిపీల్చెడి చీమల బాధలేదు
స్వీయదేహమున్నదో లేదో స్పృహయె లేదు
యోగిని సవికల్ప సమాధి నున్న వేళ.

గాయములెల్ల మానె సవికల్పసమాధిని వీడి సుంత కం
దోయిని విచ్చి గాంచఁగఁ దనూలత, మందుమాఁకులున్
వేయఁగలేదు–వైద్యులను బిల్చిన జాడయులేదు–యోగపున్
మాయ నెఱుంగశక్యమె జనంబుల కెన్నఁటికైన ధాత్రిలో.

ఇది పరికించిన తలిదండ్రులు.

పెంకుటిమండువా గృహము వీడి కుబేరదిశంగలట్టి యే
వంకలు లేనియింట నలుప్రక్కల తట్టులనిల్పి వానిపై
నింకొకదానిఁజేర్చి యొక యెత్తగు బల్లను లోన నిల్పి న
ల్వంకల మెత్తి యా గదిని భద్రమొనర్చిరి యోగవృద్ధికై.

మూడడుగజాల బారు నొకమూరెఁడు తక్కువయౌ వెడల్పునె
త్తేడడుగుల్ గలట్టి గది యయ్యది-బారెఁడు బారులెక్కకున్
మూడడుగుల్ వెడల్పు నొకమూరెఁడు నెత్తుగలట్టి బల్లపై
లే డజినమ్ము నుంచి గదలించిరి సీతమ నా సమాధికిన్.

బైటఁ దాళమ్ముఁ బెట్టి రెవ్వారలైన
నామెఁ జూడరాదంచు - పద్మాసనమున
వస్త్రశూన్యయై యే జంతుబాధలేక
మఱచె మెయి సవికల్ప సమాధియందు.

ఆఁకలి దప్పులన్ మఱచి యాత్మవిరోధుల షడ్గుణంబులన్
గూఁకటివ్రేళ్లతోఁ బెఱికి కోరికలం దహియించి ద్వంద్వపున్
మూఁకల నుగ్గునేసి యరమోడ్పు కనుంగవ నేకదీక్షతో
భ్రూకుటిఁజేర్చి సీత మనమున్ బరమాత్మను జేర్చు నిత్యమున్.

దినములు వారము ల్నెల లతిత్వరితమ్ముగ నేఁగె నా సమా
ధిని-కలబాహ్యపున్ స్మృతి గతించె-మనం బొక బ్రహ్మమందెని
ల్చెను-లభియించెఁ గోరినది-లీలయొ నిశ్చయమాయొ-రామద
ర్శన మొనఁగూడె-యోగము పురాకృతపాపవిలుంఠనమ్ముగా.

నల్లమబ్బులవన్నె పెల్లు పొల్లుగఁజేయు
నల్లని మేని యందమ్ముతోడ
తెలితమ్మిరేకుల గిలిగింతలిడిసాకు
చారెఁడు కందోయి తీరుతోడ
మిరుమించు తొలిమబ్బు మెఱుపుతీవను నవ్వు
మించుకడాని పైపంచెతోడ
అలప్రొద్దురేకల తులకింపఁజాలెడి
వక్షంపుజిగి కౌస్తుభమ్ము తోడ

తమ్మిచూలి పునకతాల్పు దక్కినంపు
సామి తూరుపుదొర జంటమోమువాడు
మున్నుగాఁ గల జేజేలు తన్నుఁగొలువ
దాశరథి సీతతోడఁ బ్రత్యక్ష మాయె.

అంత సీత.

కాంచెన్ రాముని– జానకీధవుని యోగంబందు– కన్విప్పి యో
చించెన్ రాముఁడెయంచునిర్ణయమొనర్చెన్–వ్రాలిభూమిన్ నమో
యంచున్ బట్టెను పాదయుగ్మమును దివ్యానంద కల్లోలినీ
ప్రాంచన్నీరజయై స్తుతింపఁదొడఁగెన్ భక్త్యున్నతోత్కంఠయై.

దండకము:– శ్రీరామ ! సీతామనోధామ ! దుర్వార ఘోరాఘకోటీవిరామా! మునీంద్రాదిగీర్వాణార్చితాంఘ్రిద్వయా! పారిజాతాభిరామా! వికారాంధకారచ్ఛటాభీలసోమా! మహా సద్గుణారామ ! దైత్యచ్ఛటాభీమా ! నా కూయి యాలించి

నా పాపముల్ ద్రుంచి నాజన్మ పాలింప నేతెంచితో రాఘవా! నీవెగా నాడు మత్స్యావతారంబునన్ సోమకుం ద్రుంచి వేదంబులం దెచ్చి వాణీమనోనాథుకుం జేర్చితౌ, నీవెగా మున్ను మున్నీటిలోనున్న మంథాద్రినిందేల్చి కూర్మావతారంబునన్ దేవతానీకమున్ గాచితౌ, నీవెగా చాపగాఁజుట్టి భూదేవిఁ గొంపోవు దైత్యున్ హిరణ్యాక్షు మర్దించితౌ, నీవెగా భక్త ప్రహ్లాదుబాధించు పెన్రక్కసిన్ నారసింహాకృతిన్ జీల్చితౌ, నీవెగా దుష్టదైత్యుం బలిం గోరి బ్రహ్మాండ భాండమ్ము రెండడ్గులంజేసి దైత్యేంద్రు శీర్షంబుపై ద్రొక్కి పాతాళముం జేర్చితౌ, నీవెగా భూమిదేవుండవై రాజలోకంబు దున్మాడి పాపాళిపంచప్రదంబందు బోఁగ్రుంకితౌ, నీవెగా రావణుం ద్రుంప రామావతారంబునన్ సీత వోనాడి సుగ్రీవు రక్షించి మున్నీటికిన్ సేతువుంగట్టి లంకాపురిం జొచ్చి దైత్యాళి దున్మాడితౌ, నీవెగా వీఁపునంజేర్చి పర్వెత్తు దైత్యున్ ప్రలంబున్ శిరచ్ఛేదముం జేసినా వీవెగా, ద్వాపరాంతమ్మునన్ దేవకీదేవికిం బుట్టి రేపల్లెలో మెట్టి రాకాసులం బెక్కురంగొట్టి కౌంతేయులం గాచినా వీవెగా, మున్ను సిద్ధార్థుడన్ పేర నేతెంచి భూలోకమం దెల్లవారల్ సమత్వంబునందుండ బౌద్ధమ్ము సృష్టించినా వీవెగా, గాంధి నామావతారుండవై హూణులన్ యుద్ధమార్గంబుబోనా డహింసాపథంబూని స్వారాజ్యముం దెచ్చినా వీవెగా, రామ! తభ్యం నమస్తే నమస్తే నమః

అనుచుం గన్నులనుండి జాఱి ధరపై యానందబాష్పాంబువుల్
పెనువాఁకై ప్రవహింప మ్రొక్కెడిసుతన్ బెన్మోత్ససీతాహ్వయన్
గని భూమీసుత లేవనెత్తి "తనయా! కన్నెల్లయా నీ తపం
బు నిలింపాళికినైన, నౌర! యనుచున్ మూర్ధంబుపై తట్టుచున్.

చేయిడి లేవదీసి వినిచెన్ వసుధాత్మజ సీతతోడ "త
ల్లీ! యిటనే వసింపుము ఫలించెను నీతపమెల్ల నీకు దీ
ర్ఘాయువ యైన మమ్ము బడయంగలవీవు స్మరించు నాఁడు లే
బ్రాయపు టింతివీవు సలుపన్ వలెఁ గొంత తపమ్ము నింకపై.

బిడ్డా! నీ కెదియైనఁ గోర్కెగలదా విన్పింపుమీయన్న నే
యడ్డులేక సమాధినిలో మునిఁగి నిత్యానందముంగొంచు నీ
యొడ్డున్ జేర ననుగ్రహింపు, మఱివేఱొండెద్దియున్ వద్దు నా
యడ్డాలంబను సీత లేవ నిడి దివ్యాశీస్సులం జేయుచున్.

(శ్రీ) మహాలక్ష్మి దీవింప మహావిష్ణు వింకేమైన వరములఁ గోరుమనియె. అంత సీత.

సీత మహీసుత గని యో
మాతా! మీ లీలల గన మనసయ్యెడు నా
త్రేతా ద్వాపర కృతయుగ
పూతచరిత్రములఁ జూపుము దయ ననంగన్.

దేవి తథాస్తటంచుఁ దమ దివ్యమహత్తర భవ్యరూప లీ
లా వివిధావతారపు విలాసములన్ భువనంబులన్ త్రిలో
కావృత సర్వభూధరమహోర్మురులన్ సురసిద్ధసా
ధ్యాసనులన్ వనంబుల నుదారతఁ జూపె చరాచరంబులన్

దివ్యరూప సందర్శనోత్తేజ మంది
సీత కనుమోడ్చి చేదోయిఁ జేర్చి మ్రొక్కి
చూచుటయు గాదు పోయి యచ్చోటు లెల్ల
మెట్టి వీక్షింపవలయు నెప్పట్టునైన.

అని కోరిన నటులే యగుఁగాక! యని దీవించి నీవింక సదా యోగినివనియు మహాయోగినివనియుఁ బిలువఁబడుదువని దెలిపి సీతారాము లంతర్ధానమైరి. ఆ మఱునటిరేయి.

కాయము నింటవీడి సురకాంతలఁ గాంచఁగ సాధ్వి సీత, య
త్యాయతమైన నందనమహావనమందున డిగ్గె - నందు స్వ
ర్గీయుల యక్ష కింపురుష కిన్నర సాధ్యుల వారిస్త్రీల నే
యేయెడఁగన్న నాయెడల నృత్యము సేయుచునుండఁ జూచుచున్.

గాంచె గంధర్వజాతిఁ జెంగల్వవనము
నందుఁ బంచవర్ణావనీజాంతరమున
సతులతో జలక్రీడ స్వేచ్ఛావిహార
ములఁ జరించుచు నుయ్యాలఁ గులుకుచుండ.

కూడి సప్తమహర్షులు కొలువుసేయ
నప్సరస లమోఘముగ నృత్యంబు సలుప
నమల నవరత్నఖచిత సింహాసనమున
సభ నొనర్చెడు దేవేంద్రు శచినిఁ గాంచె.

కని, యానందమునందుఁ దేలి సురభాగ్యశ్రీలఁ గొండాడుచున్
జనియెన్ ద్వారకఁజూడ, నయ్యది మహానందంబు గావించునం
చును - వీక్షించె, నచోట కృష్ణు జలజాక్షున్ రుక్మిణీనాథు శే
షుని శీర్షంబులఁ బండియుండఁగ సతుల్ జోకొట్టి సేవింపఁగన్.

వెన్నహరించు దొంగ, మృదువేణురవంబునఁ జొక్కి సోలి కా
పున్న వ్రజాంగనల్ - తలల నూఁపుచుఁబాడిన గోలమంద - గో
పన్నల చల్దివిందు - ముదిపాముతల న్నటియించు శౌరి - న
త్యున్నతపర్వతంబుఁ గసితో పయికెత్తిన కృష్ణుఁ జూచుచున్.

చనిచని సీత గాంచె హరి, స్యందనమందున పార్థుతట్టి గీ
తను వచియించుచుండ, నిరుతట్టుల సైన్యము వేచియుండ, న
రునుఁడువిచారమగ్నుఁడయి చూచుచునుండ - ధ్వజాన వాయునం
దనుఁడు ప్రదీప్తినుండ, కురుధాత్రి, త్రిగర్తులు వేచియుండఁగన్.

ఆ సడి సందడుల్ విడి హిమాచల శృంగములెక్కి సీత కై
లాసము సేరి కాంచె నచలాత్మజతోడ శ్మశానభూమి నా
వాసమొనర్చు వాని మెయి భస్మమలందెడువాని చేఁదు మున్
మేసినవాని సర్పముల మేన ధరించినవాని నీశ్వరున్.

ప్రమథగణంబు గొల్వ - వృషభమ్ము వలంకుల నిల్చియుండ - శీ
ర్షమున వెలుంగ గంగ, - యుడురాజు జటావని సొంపునింప, మం
చు మల మృదంగనాదమునఁ జొక్కి నగాత్మజతోడి సాంధ్యనా
ట్యమున మునింగి తేలు మదనాంతకుఁ జూచి నమస్కరించుచున్.

మూషకవాహనున్ బ్రమథమూర్తి విలోకనచేసి మ్రొక్కి సం
తోషముతోఁ గుమారునకు దోసిలియొగ్గి-మహర్షులుండ సం
భాషణచేసి వారి సెలవంది హిమాచలమందునున్న స
ర్వోషధులన్ గ్రహించిముదమొందుచునన్యముఁజూడనెంచుచున్

జనియెన్ శీతనగంబువీడి-వటవృక్షచ్ఛాయ, క్షీరాబ్ధిఁ బం
డిన నారాయణు నాదిదేవు హరి మౌనీంద్రార్చితాంఘ్రిద్వయున్
గని ప్రార్థించి నమస్కరించి మహదానందముంబొంది చే
రెను వైకుంఠమునాదిలక్ష్మిఁగను కోర్కెన్ సీత యా రాత్రియే.

బంగరుటుయ్యాలందు బహువర్ణసమంచితదివ్యకుడ్య సౌ
ధాంగణమందు-రత్నఖచితాంబరి దివ్యసుగంధ పుష్పశో
భాంగిని చిద్విలాసమునఁ బండిన భక్తజనార్చిత పాదపద్మ ల
క్ష్మిం గని వందనం బిడియె-సీత యయోధ్యకుఁజేరె నావయిన్.

భ్రాతల్ ప్రేముడినిల్వ పార్శ్వముల, సేవాతత్పరుండై కపి
వ్రాత శ్రేష్ఠుడు పాదయుగ్మమును గొల్వన్, వామపార్శ్వంబునం
జేతోమోదమునంద సీత, మును లాశీర్వాదముంజేయ నా
సీతారాముని గాంచె సీత యెదుటన్ సింహాసనంబందునన్.

మ్రొక్కి-యయోధ్యవీడి, మునిపుంగవులుండెడి యాశ్రమాలి న
ల్దిక్కులనున్న దిక్పతుల దివ్యపురమ్ముల, బ్రహ్మదేవునిన్
వాక్కులరాణి గాంచి, సురవందిత సీత గృహమ్ముసేరె నే
డ్యొక్కరెఱుంగరద్ది, మఱియోగులు చేయఁగరానివుండునే.

శ్రీ

# పెనుమెత్స మహాయోగిని

## V. మహాతపస్విని - లీలలు

1952 వ సంవత్సరమున మే మాసమందు శ్రీ కమ్ముల అప్పన్న గురుదేవుడు శిష్యురాలిని మహాయోగిని సమాధీ మహాభోగినిని గనులారం గాంచి యమందానందహృదయుడై యామె నుద్దేశించి యిట్లనియె:

కలి కాలమ్మునం గాంతవయ్యును దపోగర్భమ్మునం జేరి యో
గుల కాశ్చర్యముగల్గగా గృహమునం గూర్చుండి సాధించి తీ
విల శ్రీరామ కటాక్షవీక్షణము, తల్లీ! నిన్ను బోధించి క
మ్ముల యప్పన్న కృతార్థుడాయె నిది మాపుణ్యమ్ము యోగీశ్వరీ!

నిర్వికల్పసమాధిలో నిల్చియున్న
వారియందు స్త్రీజనుల నెవ్వారులేరు
లోకులు నిను వీక్షింప నీ లోకమందు
శ్రేయమా తల్లి! యిది కటాక్షింపవలయు.

అని ప్రార్థించిన మీదట.

తల్లియుం దండ్రి సోదరులు తత్పురవాసులు వేగిరింపంగాం
జల్లని తల్లిం జూడ - రభసమ్మునం దాళము దీసె తండ్రి తా
మెల్లన నప్పయాఖ్యుండపు నిమీలితనేత్రం బునీత, సీత హృ
త్ఫుల్లసరోజ డాసి చెవిమూలమునన్ వచియించెం గోరికన్.

నోటను మాటలేదు తలనూఁపిన లక్షణమేని లేదు — మో
మోటమొ, లేక సమ్మతిమొ పోల్పఁగలేక నిరుత్తరంబె యా
మాటకు సమ్మతంబనుచు మాటికిమాటికిఁ జెప్పి యెల్లరన్
బైటకుఁదెచ్చి దర్శనము భాగ్యములెం డనె దేశికుం డటన్.

అమ్మహాయోగినిని గది వెలుపల నున్నతాసీనంజేసి యట నున్న యెల్లరకు దర్శనభాగ్యంబు గలుగఁజేసె.

మేలిమిబంగారు మేని దివ్యచ్ఛటల్
ప్రేక్షకదృష్టి తప్పిబ్బుసేయ
కాఱుమబ్బుల తొలికారు విద్యుల్లత
వలెఁ గురులు కనీనికలు వెలుంగ
పద్మాసనస్థ నిర్వస్త్ర దేహంబు చూ
పరులకుఁ బెద్ద యబ్బురముగొలుప
దేహాభిమానమ్ము దెగడిప్రకృతి కతీ
తమయి నిల్చిన లజ్జ దైన్యమంద

కనులు విప్పక యెదుటిలోకంపు గోల
లేక నిరతబ్రహ్మానందలీల మునిఁగి
నిర్వికల్పసమాధి పునీతయైన
సీత జనము గన్నార వీక్షింపఁగలిగె.

వచ్చువారికి లోఁజేరు పథములేదు
పోవువారికి మార్గ మేమూలలేదు
నిలుచువారికిఁ దావు గన్పింపలేదు
దర్శనము లే కొరులు నిరుత్సాహపడిరి.

వందలు వేలు లక్షలయి పట్టనవాసులు పల్లెటూరి కా
మందులు మాలమాదిగలు తక్కొసురు లన్యకులస్థు లున్నవా
రందఱుఁ జూడవచ్చి రుదయమ్మున యాపె గృహాంగణంబునం
దెందు స్థలంబులేదు తుదినిల్చిరి పౌరులు సందుగొందులన్.

అప్పన యూరివారలు గృహాంగణమందునఁ దావులేమి పెన్
గుప్పలుకుప్పలై జనులు గూడుట వారల కేమిసేయుసో
నిప్పుడెటంచుఁ జింతల వహించిరి భారము కొంద – అంపుపై
నప్పురినున్న గొప్ప బహిరంగము సేర్చిరి సీత నంతటన్.

చేరిచి యున్నతాసనము చెట్టుసమీపమునందు – నుంచి యె
వ్వారలు సూచుకీతి మునివందిత నుంచిరి – పంతపూని య
య్యూరి జనమ్ము ప్రేక్షకుల నోపిననీతుల సత్కరించి యా
హారమొసంగి శయ్యల నయార్ద్రిత నిచ్చిరి నాల్గురోజులున్.

వేపవికాలమద్ది – కడుభీకరమై వడగొట్టుచుండె – వ్య
త్యాసములేక స్త్రీపురుషులందఱు గుంపులుగుంపులౌచు సం
తోసముతోడ పుష్పఫలతోయములం గొనివచ్చి పూజలన్
సేసిరి కొండలైపడఁగ నిర్ఝరులై ప్రవహింప నయ్యెడన్.

కొందఱు దర్శనమందదాయె నటంచు
చెట్లపై కొమ్మలఁ జేరినారు
దర్శనంబైన చిత్రమవలోకించు భా
వన నిండ్లఁ గొందఱు ప్రాఁకినారు

భుజములపైనున్న బుడుతలఁ గాపాడఁ
బూరుషుల్ వలఁతులఁ జేరినారు
మునుమున్నె జనుదెంచి ముందున్న యల్పుల
దిట్టరుల్ ప్రక్కకు నెట్టినారు

ఊరివారలు పొరుగూరివారు నితర
మాండలికు లన్యదేశీయు లెండ లెక్క
సేయక పవలు రేయి వచ్చిరి తదీయ
దర్శనార్థంబు పుణ్యతీర్థంబు వోలె.

ఐదవనాఁడు వచ్చిన మహాజనులందఱు సంతసించి స
మ్మోదముతోడ నేగిరి యమోఘమటంచు పురీయులెల్ల రా
హ్లాదమునంది రందుగల యందఱిలో నొక కొందఱిం దదీ
యాదరణీయహస్తమున నంటెను యోగిని యిచ్చె దీవనల్.

అష్టవర్షంబు లాగదియందె నిర్వి
కల్ప దివ్యసమాధిలో గడిపె నీత
లేక మలమూత్రము ల్లేక చింత
లేక అన్నపానీయముల్ లేక కోర్కె.

ఆయువుకొద్ది యీ కలియుగాంతరమందున - నందులోన లేఁ
బ్రాయపుటింతి - కాలమనస్వల్పము యోగమునేర్వ - నన్నపా
నీయములన్ శరీరము జనించెను _ దుష్కరమవ్విపీడ - న
త్యాయత దేహవాంఛ విడనాడ, నశక్యము మానవాళికిన్.

యమనియమాది పద్ధతు లహర్నిశము న్విడఁబోక స్వీయదే
హమునెడ యాశవీడి- గెలి చంగదశమ్ము- మనమ్ము నొంచి-ని
త్యము హఠరాజయోగముల నాత్మజయించి సమాధినుంట సా
ధ్యమె- లభియించె సీత కదియంతయు పుష్కరకాలమందునే

అతికష్టంబున నన్యలభ్యము మహాయాసం బసామాన్య ము
న్నతమాదర్శము సీ సమాధి – మహితానందంబు సాధించె సీ
త – శతోపస్విల కే యుగంబునను సాధ్యాసాధ్యముల్లేవు – భా
రతదేశంబు వెలుంగదే తపసులన్ రాజర్షి దేవర్షులన్.

సవికల్పంబును నిర్వికల్పమును మున్ సాధించి – నిత్యమ్ము యో
గవికాసమ్మునఁ దేజరిల్లు వనితన్ గమ్యాన్వయోద్భూత నీ
యవనీజా కరుణాప్రశోభితను దివ్యాధ్యాత్మికోత్తేజ నెం
దవలోకింపగ శక్యమా తలఁప నన్యాంబి యుగం బన్నిటన్.

అంబరగాములై భువనమంత చరించెడి యోగులెల్ల నీ
రంబుల నాని దుంపల ఫలంబుల మెక్కి సమాధిఁ గొంత కా
లంబు వసించి బాహ్యసకలస్థలి ద్రిమ్మరువారె కాని సీ
తాంబికవోలె రేయి బవ లాత్మఁ దపించెడి వార లుండిరే.

కొద్దివయస్సునందె పతి గోల్పడి సీత వియోగబాధ ము
ప్పొద్దు కృశించి దివ్యపథమున్ గ్రహియించె శ్రమించె యోగపున్
హద్దులమధ్య గట్టువడి, యందె సమాధిని నిర్వికల్పతన్;
ఎద్దిజయింపలేరు దపియించుట నేర్చిన మానినీమణుల్.

ఎన్ని భవమ్ములందుఁ దపియించి గడించెనొ సీత యోగపుం
బున్నెము మున్ను-దాన యొక పుట్టువునందె సమాధి దివ్యసం
పన్నత చేకుఱెన్ మఱి తపస్వినియాయెను సీతరాముచే
మన్ననలందె పృథ్వి నసమానఫలంబు గడించె నెంతయున్.

ఎన్నొ జన్మలసల్పి యీశ్వరారాధన
నాత్మవిచారణ మందగలిగె
మాయ నశించె నాత్మస్వరూప మరసె
పృథవిరాగమునంద దృష్టినిలిపె
ఆకస్మిక జ్ఞాన మభ్యుదయమునందె
సంసారదృష్టి నాశనమునందె
సృష్టిరహస్యవైచిత్ర్యమున్ గ్రహించె
పరమాత్మను సమాధి బడయఁగలిగె

సగుణ నిర్గుణోపాసన సారమైన
సచ్చిదానందబ్రహ్మము స్పష్టమాయె
పూర్వ దుర్భరావేదనము నశియించె
నన్ని యెడల బ్రహ్మానంద మతిశయించె.

స్వప్నమున సంఘటన లెన్నొ సంభవించు
కాని విజ్ఞాన మభివృద్ధి కాదు సుంత
సంయమి సమాధి కొంత విశ్రాంతినంది
బయలుపడునేని విజ్ఞానపరిధి పెరుఁగు.

ఏ సమాధియేనియు లభియించుఁగాక
పూర్వ మెన్నఁడులేని యమూల్యమైన
జ్ఞాన మబ్బు సమాధి యనంతరమ్ము
బోధనాతీతమై యవి పొంగులెత్తు.

హఠ లయ ధ్యానభక్తి సాంఖ్యమ్ములందు
నెద్దియైన సాధకునకు నిచ్చు ముక్తి
దీక్ష పరిపక్వదశను సాధించునేని
ఆత్మ పరమాత్మతోడి నైక్యంబునందు.

బ్రాహ్మణుఁడైనఁ బంచమవర్ణుఁడైన
పురుషుఁడేయైన స్త్రీయైన, భోగియైన
వట్టి నిరుపేదయైన దివ్యానుభూతిఁ
జెందనగు పారమార్థిక చింతయున్న.

జన్మచే స్థితిగతులచే సాంఘిక ప్రతి
బంధములచేత బాధింపఁబడరు జనులు
'జన్మహాన్య' బ్రహ్మైకవిజ్ఞానమెల్ల
స్వస్వరూపమ్మె బ్రహ్మమ్ము సోఽహమదియె.

మానవజీవిత పరమాశయమైన పరమాత్మ సాక్షాత్కారమే దైవసాక్షాత్కారము. భగవదైక్యజ్ఞానమందినవారే ధన్యులు. మానవశిరోభూషణులు. ఈ పవిత్రస్వరూపులే మహర్షులు రాజర్షులు దేవర్షులు.

ఖేదము మోహాదు:ఖసులు కించదనం బసువబల్ నశించు చం
ద్రోదయమైన చీకటులు రోదసి వీడువిధాన - నాస్మ త
త్త్వోదయమాను - చంద్రికలవోలెః తపోఫల మొల్లవానికిన్
మోదముకల్గఁజేయు - వనమున్ వెలిఁగించెడి చందనంబటుల్.

ఆపై నొక్కదివసంబున గుఱుమద్దాలినుండి శ్రీరామావ
ధూతా ప్యకోటికి సుప్రసిద్ధురాలగు బుచ్చెమాహ్వాయ, యనసు
చరులతోఁ గూడి మహాయోగినీ దర్శనార్థంబు పెన్మెత్సఁ
బ్రవేశించి మునివందితను డాసి.

వందనమంచు పాదములపైఁబడి మ్రొక్కి, యనుజ్ఞనేచి యా
నందమనోజ్ఞబాష్పముల నల్గడలం బరికింప శిష్యురా
లిం దనముందుచేర్చి తన లీల నొకించుక చూపఁగోరి యి
చ్చెం దనచేయి సీత పరిశీలన చేయగఁ బుచ్చెమాంబకున్.

అరచేతం బ్రభవించి వెల్వడిన దివ్యజ్యోతినిం గాంచి య
బ్బురపాటొందెనుబుచ్చమాంబ-పయి మోమునుంజూపనోర్వెప్ప సీ
త, రవుల్ వేవురు గానుపించి రచటన్ ధన్యంబు ధన్యంబు నా
ధరణిన్ వ్రాలెను శిష్యురాలు తన నేత్రంబుల్ గనన్ జాలమిన్.

విశ్వరూప సందర్శనవేళ దివ్య
దృష్టి క్రీడికి హరి ప్రసాదింపఁడేని
నరుఁడు వీక్షించునే దాని - నరులఁ బుట్టి
చర్మచక్షుల దాని బుచ్చమ్మ గనునె.

స్మృతి యిసుమంతలేని తబిసిం గని లే నగు వంకురింప సీ
త తనదుహస్తమునఁ దాఁకుచుఁ దట్టిన నాపె లేచె శి
ష్యతతి ముదంబునందె – పలుసారులు మ్రొక్కిరి తోడిశిష్యురా
లి తరపునన్ మహామహుల లీలలెఱుంగ నశక్యమేరికిన్.

అబ్బురపాటువోయి హృదయంబు ముదంబున నిండి వచ్చి త
బ్బిబ్బయిపోవ నోటఁ బడి వెల్వడకున్న నమస్కరించి పె
ల్లుబ్బిన భక్తితోడ నిటయుగ్మమునంబడె బుచ్చుమాంబలో
నిబ్బరమంత చేకుఱె జనించెను ధైర్యము వాడకేఁగఁగన్.

మహాయోగిని మాహాత్మ్యంబున కచ్చెరువడె. ఆ శిష్యకోటి దేవి యాజ్ఞఁగొని కుఱుమద్దాలిని జేరిరి. అప్పుడు యోగిని శిష్యతతి కిట్లుబోధించె.

ప్రపంచోదయమునకు మున్నున్న పరిపూర్ణాఖండజ్యోతి చర్మచక్షువుల కదృశ్యము. జీవాత్మ పరమాత్మైక్యసంధానంబునకే వీక్షణీయంబు. ఈ యాత్మద్వయైక్యమే నిర్వికల్ప సమాధి. దీని సాధించు పథంబొక్కటియ. ఇడాపింగళుల రేచక పూరకముల కుంభించి శ్వాసమును నాభిస్థానమునుండి బ్రహ్మదండిగతసుషుమ్నామార్గమున బ్రహ్మరంధ్రముగడచి బ్రహ్మకపాలమున సహస్రారకమలంబున ప్రవేశింపఁ జేయవలయు. తన్మార్గమున జీవాత్మ యూర్ధ్వముఖమై పరమాత్మైక్యంబునందు నాభిస్థానాగ్నిజ్వాలల తీక్ష్ణంబున సహస్రారకమలంబు

గరఁగి యమృతంబు వాగ్గహ్వారంబున వర్షించు. అత్తఱిఁ గొంతు బిగబట్టిన నద్దానిఁజూడ సాధ్యంబు. జీవాత్మప్రవేశకాలంబున కపాలం బతిసున్నితంబగు యోగులకు తత్ప్రవేశము గ్రాహ్యంబ. ఓంకారసాహాయ్యంబున జీవాత్మ బంధననిర్బంధనములు సహస్రారంబున సాధ్యములు. ఇదియ సహస్రవర్షతపోఫలితాఖండ బ్రహ్మానందము. నిర్వికల్ప సమాధి. దీని సాధన మరణ్యాపర్వత గుహానదీతటంబుల సుకరంబు. గ్రామదేవాలయ సత్ర మఠ స్థానంబుల కష్టము. శరీరము తపస్సమయంబున శిలాసదృశంబున గదలనీయకుండుటయే సాధనరహస్యము. పూజాదిజపతపంబులు మనోవేగ ప్రతిబంధన సాధనములు మాత్రమే. తపోనిమగ్నులకు భ్రూమధ్యజ్యోతి దర్శనీయంబు. శ్వాసప్రకోపితములైన డెబ్బది రెండువేల నాడుల ధ్వనియే ఓంకారము. అది చిణిఛిణిశంఖ వేణువీణాతాళ ఘంటాభేరిమృదంగమేఘ దశవిధనాదయుతము. యోగి నాదశబ్దానందోన్మత్తుఁడై యమృతపానమూని శూన్యమనంబునఁ దన్నుఁ దా మఱచి బ్రహ్మానందమునఁ జొక్కును. ఇట్లు బోధించి మహాతపస్విని యానాఁటికి సమాధిం జొచ్చె.

అది యొకనాఁటి సంధ్య,తన ప్రాంగణమందునఁ గూరుచున్న సీత దరికి యార్లగడ్డ వనితామణి వేంకటసుబ్బమాంబ సేరి దయవహించి భౌతికశరీరమునందలి, మీదు చిత్రమును బదిలముసేయనొప్పు, మన వల్లెయటంచు తలూఁపె దేవియున్.

ఛాయాచిత్రము దీయు యత్నమున నా సాయంతనం బొక్కనిన్
ఛాయాచిత్రపరిగ్రహుం బిలిచి యాశాపశ్చిమంబందు నా
మాయాదేవినిం జేర్చ సూర్యకరముల్ ప్రాన్వైట్టె మోమందు నా
పై యేదిక్కున ద్రిప్పినన్ గనఁగనయ్యెన్ మోమునం బైనవ్వియే.

ఏమి విచిత్రమిద్ది తమ నేదిశ ద్రిప్పిన సూర్యదీప్తియే
మోమున దాండవించునని మ్రొక్కిన వేంకటసుబ్బమాంబ పై
వేమఱుదృష్టి నిలుపఁ గనుఁగొంచెసలె యౌనె జేసె – భక్తిచే
ప్రేమ జయింపఁగాఁబడుట విశ్వమెఱింగిన సత్యమేకదా.

ఆహాయి యార్లగడ్డ త్రిపురాంబ యొకానొకనాఁటి సాంధ్యసే
వాపరతంత్రతన్ భజనసల్పుచునుండఁగ శిష్యకోటి దీ
క్షాపరతన్ మెలంగ సవికల్పసమాధిని వీడివచ్చి యొం
తే పరమాత్మగూర్చి వచియించె తపస్విని తేట తెల్లఁగన్.

ఇంద్రియమ్ములు విషయేచ్ఛ నేగకుండ
ద్రిప్పి కేవల కుంభకస్థితిని నిలుప
నండ్రు దాని ప్రత్యాహారమంచు యతులు
దాని నభ్యసింపవలె నిత్యంబు దీక్ష.

దూరదృష్టి దూరశ్రుతి దూరయాన
మల్ప కాలంబున, సదృశ్యమగుట గగన
యానముం గామరూపత్వ మన్యకాయ
ధారణమ్ము వాక్సిద్ధి లభ్యమ్ము దాన.

అష్టసిద్ధులందు రవ్వాని యోగి యా
సింపరాదు వాని - శిష్యుఁడెవ్వఁ
డైన కోరిన పని యతి యొనరించరా
దవ్వి యోగమునకు నహితులగుట.

కుండలినన్న శక్తి దనకున్ వశమయ్యెడు - దానిశ్వాస నె
వ్వండు గదల్ప—నాభి విడి పైనమొనర్చునో - బ్రహ్మదండిగో
నుండుసుషుమ్నమార్గమునునూర్ధ్వముఖంబయి బ్రహ్మరంధ్రమె
న్నం బదిదాఁటునో కమలమందెపుడుండునో నాఁటినుండి యున్.

అనయంబున్నదు పర్ధరాత్ర్యుదయమధ్యాహ్నంబులన్ సాంధ్య పా
యని శ్రద్ధన్ ఋజుమార్గవర్తియయి ప్రాణాయామమున్ జేయుచో
వినుఁడీ మృత్యువు చేరలేదు ప్రళయంబేయైన - నయ్యోగి చా
వును వాంఛించిన సంభవించునది - చావుంగోరఁడా లేమసూ.

ఇతఁడే బ్రహ్మయు విష్ణువున్ శివుఁడునై యిష్టానుసారంబుగా
బ్రతుకఁగ వచ్చును - వ్యాఘ్రసింహమృగరూపంబెత్తి క్రీడింపనౌ
సతతం బా యతి యష్టసిద్ధి జనితేచ్ఛన్ సర్వలోకంబు ల
ద్భుతరీతిం దిరుగాడవచ్చు సురసందోహమ్ము పూజింపఁగన్.

బ్రహ్మ సత్యం జగన్మిథ్యయే ఆసనము. బాహ్యశుచియే యోగికిస్నానము.నిశ్చింతయే అర్ఘ్యము పాద్యము. సంకల్పవికల్ప రాహిత్యమే యాచమనము.జాతి కుల మత వర్గభేద రాహిత్యమే జ్ఞానసముపార్జనము.ఇంద్రియబంధనమే శౌచము. "సర్వంబ్రహ్మ"

జ్ఞానమే గంధము. బ్రహ్మైకీకృతదృష్టి యక్షతలు. సోఽహమే యథార్థధ్యానము. బుద్ధిమనోఽహంకారస్వాధీనమే భజన. ఆత్మజ్ఞాన నిమగ్నతయే విజ్ఞానము. ఈ జ్ఞానాగ్నియే ధూపము. నేటిసర్వతత్త్వ అహంబ్రహ్మజ్ఞానమేజ్ఞానసూర్యోదయము. నేనని సర్వపరిపూర్ణమున నైక్యమగుట నైవేద్యము. అందు చరింప కుంభకటయే ప్రదక్షిణము. ఆత్మజ్ఞాననిష్ఠాతత్పరతానందమే రామసంకీర్తన. బాహ్యాంతర్గత పరిపూర్ణత్వమే జపము. సంకల్పవికల్పరాహిత్యమానమే స్తుతి. జీవాత్మపరమాత్మైక్యమే నమస్కారము. నామరూపవిసర్జనమే మోక్షము.

త్రిపురాంబావదనమ్మునపై నిసురుచున్ దీవించి, శ్రీరామభక్తపరివ్రాజిక యోగినీజనములే ధన్యుల్ తుదిన్ వారె ముక్తిపదంబందెడువారు - వారిపక్షమందే నిల్చి ధ్యానింపుమా యపుడే నీవు తరింపగాంగలవు బిడ్డా! యంచుంజెప్పెం దుదిన్.

ఒకనాండెల్లరు దీక్షమై భజనలో నుండంగ నవ్వారిభక్తికి సంతోషము నంది యోగిని సమాధిన్ వీడి శ్రీరామసేవకులంజేరి భజింపంగాదొడంగె - నా పల్లీయు లద్దేవి చేతను నుప్పొంగుచు గోపికాజనము చందానన్ నటింపం దుదిన్.

జడలుగట్టిన శిరోజములు చిందఱవంద
 తై మేఘపంక్తుల యంద మొంద
పుట్టమ్ములేని మై దట్టమై వెలువడి
 మెఱుపుకాంతులు మిఱుమిట్లుగొలుప

## పెనుమెత్స మహాయోగిని

కిన్నెరకన్నెల సన్నని 'గాత్రమ్ము'
వినువారి వీనుల విందుసేయ
తొలికవి కైతలో వెలువడ్డ భావాల
మఱపించి గీత లంబరము కెగయ

ధరణి పద్మాసనమున సితారు చేతఁ
బట్టి గోటమీటుచు లయబద్ధమైన
గేయములు పాడ హిమతరుచ్ఛాయలందు
తపముగావించు గిరికన్య తలఁపు వచ్చె

కైలాస మానసకాసారమునఁ దేలు
నంబుజంబులను, రాయంచవోలె
శారద పూర్ణిమాచంద్రిక దివి వెల్గు
తారలలోని సుధాంశుభాతి
అఖిలశాస్త్రంబు లధ్యయన మొనర్చు ఛా
త్రసమూహమున జడతాల్పు కరణి
ధవళాద్రి తండోపతండంబులై నిల్చు
ధేనుసంతతి కామధేనువటుల

తనదు శిష్యప్రకోటి మధ్యంబునందు
చే, సితారు నంది హరి భజించువేళ
గానుపడె మహాయోగిని కనుల కఱవు
దీఱ భక్తజనంబు సంతృప్తి నంద.

భక్తరక్షణపరతంత్ర భవ్యచరిత
హర్షపులకితదేహ దివ్యగుణగేహ
ప్రేమపూరితహృదయ విన్పింపఁదొడఁగె
భవ మహాసాగర తరణోపాయ మొండు.

భక్తజనులార నిర్గుణోపాసనమ్ము
బహుప్రయాసమగు సగుణోపాసనమ్ము
సులభసాధ్యమ్ము శ్రీకృష్ణుఁదలఁచి కీర్త
నమ్ము గావింపుఁడీ యనుదినమ్ము మీరు.

మీదు జన్మ తరించు శమించు నఘము
భవవిదారణమార్గమ్ము పావనమ్ము
కలియుగమ్మున సాధన సలుపరమ్ము
అప్పు డాత్మ సాక్షాత్కారమగును మీకు.

అనుచు శీర్షాసన విధాన మంతఁ జూపె
నచటి భక్తు లానందమందుచు భజింప
మరల తా నిర్వికల్పసమాధిఁ జొచ్చె
సీత సద్గుణోపేత పునీత మాత.

కాననసీమలందు నగగహ్వరభాగములన్ నదీ తటం
బీనిన చెట్లనీడల శ్రమించి కుటీరము లుంచి యెండలో
మౌనులు పూర్వమందు నసమానతపంబున ముక్తిగాంచ నీ
మానిని సిద్ధినందె పదిమంది వసించెడుచోట నింటిలో.

శీతనగంబులున్ విపినసీమలు శైవలినీతటంబు లా
సేతుహిమాచలంబున ఋషీంద్రకుటీరము లంతెగాని యీ
నీతికుఁబోలెఁ దండ్రియిలు చిన్నిగృహంబును పల్లెటూరునే
జాతినిలేవుగా జపము సల్పెడి తావులు భారతమ్మునన్.

గౌరి మహేశ్వరుం బడయఁగాఁ దపియించెను మున్ను జాహ్నవీ
తీరములన్ హిమాలయప్రదేశములన్- పరమాత్మఁగోరి ను
ర్వారతపమ్ము సేసె గృహభాగమునందునఁ బల్లెటూర సీ
తారమ- కామితార్థములు దక్కెను నాగి కిఁ జేసుచిత్రమో

సీతయె గౌరియో, యుమయె సీతయొ, యెవ్వరెవారో-సీత భూ
మీతలమందుఁ బుట్టినది మెట్టిన దౌక్కతె యీ యుగంబునం-
దే తరమందుఁ బుట్టినదొ యెవ్వరెఱుంగరు గౌరి- ఛాత్రయున్
మాతయుదివ్యయోగినులుమాన్యచరిత్రలులోకమందునన్.

మఱియొకనాఁడు శిష్యజనమందు భజించుచునుండ భక్తిత
త్పరతసమాధివీడి మునివందిత వారినిఁజేరె - చేరి య
బ్బురముగ నిత్యకర్మముల బోధనొనర్పఁగఁజొచ్చె యోగత
త్పరులకు దీనిమించిన ముదావహకార్య మున్నదే.

అరయఁడి తీర్థయాత్రల ప్రయాసము లేటికి, నంతకన్న నం
దఱు సులభమ్ముగాఁ బరమునందెడు మార్గముఁ దెల్పుదాన, నె
ల్లరఁ బరమాత్మయుండు, మదులందు భజింపుఁడు దానినే నిరం
తరము, మఱొక్కజన్మకయినం దరియింతురు నేఁడుగానిచో.

కాలకృత్యంబులఁ గావించి యుభయసం
ధ్యలయందు భగవంతుఁ దలఁపవలయు
బీదసాదులయందుఁ బ్రేముడి నిరతమ్ము
నన్నదానంబు సేయంగవలయు
నాస్త్యస్తివాదమ్ము లాపక యేకోహ
రి యటంచును దేవు స్మరింపవలయు
పాపకార్యంబుల వాసఁబడక యమ
నియమంబులం దాత్మ నిలుపవలయు.

నిర్మలహృదయమ్మున నొక్క నిర్జనప్ర
దేశమందు పద్మాసనస్థితి నిరంత
రమ్ము నోంకారమును జెప్పి ప్రార్థనమ్ము
సేయవలయు భయములేదు జీవి కపుడు.

పారమార్థికదృష్టి జీవంబు గడపు
వాఁడు మరణకాలంబునంగూడ శాంత
చిత్తుఁడై భగవాను భజింపఁగలఁడు
దానఁ దరియించు నే జన్మనైనఁగాని.

అంచు బోధించి యనంతరంబ మహాయోగిని వెండియు సమాధిఁ బ్రవేశించె.

జీవసమాధిగోరి విరచించెను లేఖ యొకండు సీత- తా
నీవిధి నింక దర్శనమునీయగ సాధ్యము గాదటంచు శ్రీ
దేవి యనుజ్ఞయాయె, నిజదేహము వీడుచు వారితావునం
దే వసియింపఁగా ననుచు నియ్యదిగాంచిరి శిష్యులెల్లరున్.

కాంచినంతన శిష్యసంఘమ్ము దల్లి
దండ్రులు సహోదరులు గంటఁ దడినిఁబెట్టి
రమ్మ దర్శన మింక దూరమ్మటంచు
చూచుచుఁ బ్రతికియుండఁ బూడ్చుటయ యంచు.

ప్రాణముతో సమాధి దిగి వత్సర మైదుదినంబు లాయె న
మ్మానిని యున్న జాడ యణుమాత్రను గానగరాక పోయె నే
మైనదొ నిర్వికల్పపు సమాధినెయున్నదొ, లేక ఆత్మ యే
మైన షికారులేగినదొ – యయ్యది యన్యు లెఱుంగ శక్యమే.

గదియా తాళముతోడ నుండె తెలువంగా నాజ్ఞయున్లేదు-తోఁ
చదు భక్తాలికి నేమిసేయుటకు పూజ్యంబైన పెన్మెచ్చకున్
ముదిమింబ్రాయపువారుయావనులుపూఁబోఁడుల్,మహాయోగినీ
పదసేవార్థము రాదొడంగిరి పదుల్ వందల్ సహస్రంబులై.

వచ్చుచె కాని తల్లి గనవచ్చుటలేదనువార్త హెచ్చె నం
దెచ్చటఁగన్న– నైనఁ జనుదెంచెడివారల కంతులేదు పై
పెచ్చు స్థలమ్ములేదు పురవీధుల నిండ్ల జనమ్ములుండ పె
న్మెచ్చ విచిత్రవైభవము నింగినిముట్టె యనూహ్యలీలలన్.

వచ్చెన్ బౌద్ధుఁడొ సిద్ధుఁడో,తబిసియో బైరాగియో యెవ్వఁడో
యిచ్చెన్ ద్వేషములేనివాఁ డొకఁడు దానీక్షించి యీ వైభవం
[illegible] కీతము వెట్టె, కాని తన పాపంబేమొ యప్పొద్దునన్
[illegible] లేదు కవాటముల్ జనని గాన్పింపంగ లేదెరికిన్.

చనియె నాతఁడు కడునిరుత్సాహపడుచు
దర్శనం బబ్బమి- పునహోదంపతులును
జేరి మూఁడునాళ్లున్న దర్శింప వీలు
గామి నేఁగిరి వెంట దుఃఖమ్ముఁగొంచు.

కొండొక కాలమునకు మహాయోగినీ వాంఛితంబైన జీవసమాధిని గూర్చి విచారించి తల్లిదండ్రులు, కృష్ణామహానందలిఖితాధికారి యను మతి యవసరమగుటయు సప్పుడప్పుడు భక్తులకు ప్రపంచ పాపపరిహారణార్థంబు తపస్వినీ సందర్శన మత్యంతావసర మగుటయుఁ గొంతకాలమువఱకు గోర్కె విరమించుకొనుట సమంజసమనియు నొక్క లేఖ లిఖించి సమాధియందుంచిరి.

తల్లిదండ్రులకోర్కె చిత్తమ్ముహత్త
దర్శనంబీయ నొప్పె సీతమ్మ తబిసి
మఱుదినంబున మధ్యాహ్నమందు భక్త
లకును దర్శనం బీయ వెల్పలకు వచ్చె.

క్రీ. శ. 1953 వ మార్చి యిరువదియునేడవదినమున.

వచ్చి యటనున్నవారితో భక్తజనులఁ
జీరఁబనిచె – నవ్వారలు సేరినంత
నిచ్చెను గురూపదేశంబు నెల్లరకును
కాజ పద్మనాభాఖ్యుఁ డొకండు గొల్వ.

నేన విష్ణువు బ్రహ్మంబు నేన శివుఁడ
నేన – నేనంత నిండియున్నా నటంచు
సలిపి బ్రహ్మోపదేశమ్ము సకలభక్త
తతికి శక్తిరూపమునఁ బ్రత్యక్షమాయె.

అదియ వత్సరమ్ము నెల – ముప్పదియవ దిన
మందు సాయంతనపువేళ నచటి కెల్ల
గ్రామములనుండి యేఁతేరి రా మహాత్ము
దారిఁ గాంచుకొనిరి భక్తజాలమెల్ల.

రెండవసారి యియ్యది పురజనులెల్లరు దర్శనార్థులై
యెండయు వాన రేయిబవలెంచక వచ్చిరి రాజ పద్మనా
భుండును వత్సలీమణియుఁ బొందిరి నాఁడె గురూపదేశమున్
బండువయయ్యె నెల్లరకు భవ్యతపస్విని గానుపించుటన్.

అటుపయి పద్మనాభము దయానిధి గాంచె నిశార్థమందు పో
వుటకు ననుజ్ఞఁగోరె, సెలవున్ దయచేయుచు మాతవల్కెఁ బో
వుట సరిపోదు నీ కికను ప్రొద్దులమీఁదటఁ బ్రపంచమునేయుమికా
యటుపయి నీవు గోరునటు లంతరదృష్టిని గానుపించెదన్.

కాసుల కాసఁజెంది పలుకష్టములందక నీవు యోగము
భ్యాసమొనర్పు నాదయకుఁ బాత్రుఁడవయ్యెదు క్రిందజన్మలో
చేసిన పాపమంతయు నశించును – యోగము నేర్చువేళ ప
ద్మాసనమందెయుండవలెమౌనము ముఖ్యము యోగి కెప్పుడున్.

ప్రాణాయామము "ఓం" అను మంత్రసిద్ధముగానైనను గాయత్రీమంత్రయుతముగానైనఁ జేయఁదగు. ఓంకారయుతమే సులభసాధ్యము. సంచితలభ్యపాపము లీ జపాగ్ని భస్మమగును. కాని ప్రాణాయామము క్రమక్రమముగా నభ్యసింపవలయును. త్వరితగతి నభ్యసించుట సింహశార్దూలద్విపముల మచ్చికఁ జేయుటవంటిది. మహాపాయము. అదియే హానిని పెంపును. ప్రాణాయామమున మనంబు తలఁపులు నశించును. సమాధి నాత్మసాక్షాత్కారమగును. ఉపన్యాసమున మనస్తుష్టియగును. ప్రాణవాయువు బ్రహ్మదండిమధ్యనున్న తెల్లని సరంబువంటి సన్ననిమార్గంబునఁ బ్రవేశించి బ్రహ్మరంధ్రమును దాఁకి కపాలమున సహస్రారమందు ప్రవేశింపఁజేయుచో యోగి కృతార్థుఁడగును. అదియే ప్రాణచలననాశనము. శాంతి. అదియే యోగుల కాయుర్వృద్ధి. దీర్ఘకాలసమాధిస్థయోగి మరణకాల మెఱింగి బ్రహ్మరంధ్రమున వాయువు నిల్పి యముని జయించును. ఇష్టమైనవాఁడు ప్రాణము విడువఁగలఁడు.

ఆపయి వైచి యాసనము లయ్యెడఁజూపెను పూర్ణకుంభకం
బాపె - తదీయభ్రూకుటిని నంతట జ్యోతి వెలుంగఁజేసె - నే
నా పతి, పత్ని, శీర్షముల నంటుచు దీవనలిచ్చె - తీక్ష్ణదృ
క్పాపములంట రామతులసమ్మను పత్నినిగాంచి యిట్లనెన్.
భక్తికి సంతసించితిని బట్టుదలం గనిపెట్టినాను నీ
శక్తికిమించు యోగమును సాధనసేయుటకు ప్రస్తుతమ్ము మం
త్రోక్తులఁ దృప్తినందుము వధూమణి-నీకు సమాధియబ్బు పై
ముక్తియుఁ గల్గు నీ నియమమునుంగొని, సల్పు గురూపదేశమున్.

**అనుచున్** మాత ముఖారవిందమున బ్రహ్మజ్ఞానతేజమ్ము నె
మ్మనమందుం గరుణామృతం బొలుకగా మంత్రోపదేశమ్ము సే
సెనువారిద్దఱు తల్లియాజ్ఞగొని యాచిత్రమ్ము డెందమ్మునం
దున పేమాఱు స్ఫురింపఁగాఁ జనిరిభక్తిల్ దమ్ము వెంటాడఁగన్.

కమ్ముల యప్పనాహ్వయుఁ డొకానొకనాఁటి దినాంతమందునీ
తమ్మను జూడవచ్చి నిరతమ్ము తపస్విని భక్తకోటిపైఁ
జిమ్మెడి ప్రేమ, వారల సృజించినభక్తి, సమాధి నిత్యవా
సమ్ము గ్రహించి మోదమున ఛాత్రులకున్ వచియించె నిట్టులన్.

తన సమాధి విడచువేళ దల్లి పొంది
నట్టి దివ్యానుభూతుల స్వానుభవము
వ్రాయుచుండును సంకల్పబలముచేతఁ
గడను జేర్చియుంచుఁడు పుస్తకమ్ము కలము.

అనుచు వచియించి గురుదేవుఁ డరుగునంత
భక్తసంతతి సల్పె నా పగిది – వాని
గొంచు రచియింపఁ దొడఁగె నాకొన్నవాని
కొక్క గ్రంథరాజము స్వీయయోగమతము.

నిత్య స్వానుభవజనిత
"సత్యాత్మజ్ఞానయోగసాధనమోక్ష"
స్తుత్యగ్రంథము వ్రాయుచు
సత్యంబే దైవమంచుఁ జూపెన్ దానన్.

ఏదో తెనుంగు కొంత పఠియించెను మున్ను తదన్యభాష నే
ఔదియురాదు– సంస్కృతము నెట్లు ప్రవేశముగల్గెనో జనా
మోదముగల్గ గ్రంథము నపూర్వముగా రచియించె శ్లోకప
ద్యాదుల గేయకీర్తనల తత్త్వములన్ వచనప్రబంధమున్.

అష్టవర్షముల్ మొట్టి లనంత దివ్య
భవ్య వైరాగ్యమూని తపం బొనర్చి
జ్ఞాన భక్తి సాంఖ్య హఠయోగముల స్వాను
భవము గడియించి వ్రాసె ప్రబంధ మొండు.

లోకకల్యాణముల్ భక్తలోక మార్గ
దర్శకమగు గ్రంథ మ్మమృతమయములగు
డెబ్బదియొక విషయముల నిబ్బడించి
దానఁ దన పూర్వజన్మవృత్తాంత మిచ్చె.

అందలి విషయమ్ములు:– తనకుగల్గిన దివ్యదర్శనము, పంచీకరణ విమర్శనము, శరీరలక్షణము, సాంఖ్యవిచారణము, పంచకోశ పంచీకరణము, స్థూలదేహపంచీకరణాంతఃకరణ త్రిగుణములు (సాత్త్వికరాజసతామసములు) గర్భపిండోద్భవములు– శ్వాసము నాసికల మార్చుట– ప్రాణాయామము– యోగాభ్యాసము నిర్గుణపూజ, ఆత్మగురుత్వము. (జీవాత్మ శరీరనివాసము) రామాయణాంతరార్థము, సగుణనిర్గుణోపాసభేదము– జీవాత్మ వటపత్రశాయి భేదరహితము, జాగ్రత్ స్వప్నసుషుప్తి తురీయావస్థ– ప్రపంచవిరక్తిమార్గము– సృష్టిపూర్వ ప్రపంచస్థితి

ప్రాణాయామాపూంతరనిష్ఠ, యోగాభ్యాసోద్భవశరీర శ్రమ, ఉపనయన గాయత్రీరహస్యము- ప్రాణాయామము ప్రాణలయము, దశవిధనాదములు మనోత్పత్తిస్థానము మనోవేగము మనోవేగము నిల్పుట చిదాకాశమున మనోవేగము నిలుపుట నోరుతెఱచి మనోవేగము నిలుపుట- ఈశ్వరునకు మనసు నర్పించుట -ఈశ్వర స్తుత్యానంతరశయనము, సమస్తప్రాణుల శ్వాసము నడిపి యాయుర్భాగము చూపుట- హంససూత్ర రహస్యము, మనస్స్వభావము. బ్రహ్మసూత్రమే యజ్ఞోపవీతము. రాజయోగము ప్రాణాయామమంత్రజపసంప్రజ్ఞాతసమాధి సోఽహం మంత్రజపఖండనము- అసంప్రజ్ఞాతసమాధి- చిదాకాశము నిర్వికల్పసమాధి, మాయాశక్తి- బాధితాత్మ సంసారము ననుభవించుట – మూత్రపుసంచిని స్త్రీవులు కనుగుట పంచముద్రలక్షణము. తన్ను దా నెఱుంగుట మనోలయము, మానససమాధి విచారణ- శాస్త్రవిచారణ, జపతపనిష్ప్రయోజనము. జీవాత్మ పరమాత్మల వసననిర్గమనము – మోక్షము – నాల్గు కులములు జీర్ణశక్తి ఆయుర్వృద్ధి జీవన్ముక్తి. సంసారవాసన. వాసనాత్రయము. బంధమోక్షాత్మానాత్మల లక్షణము. పరమశివుడు మోక్షమిచ్చుట. గర్భవ్యాధికారణములు. సగుణ నిర్గుణోపాసనభేదము. అఖండపరిపూర్ణము. మనోలయముచే సకలసిద్ధి – సంచితప్రారబ్ధాగామికర్మములు. శవవ్యసనశోకకారణము. దారేషణ పుత్రేషణ ధనేషణ కామస్వరూపము. అన్నము మంత్రపూర్వకశుద్ధి తత్త్వపరిశోధన సంసారబంధము పురుషుని వెంబడించుట. పరమాత్మప్రార్థన పూర్వజన్మవృత్తాంతము, తత్త్వములు.

ఐదువందలిరువదిరెండైన పుటల
డెబ్బదియొకండు విషయమ్ము లబ్బురముగ
చేతవ్రాసి భక్తుల కందఁజేసె నొక్క-
నాఁడు ప్రాచీనఋషుల గ్రంథముల మించ.

కొన్నిదినమ్ము లాయి నఖండతపదీక్ష తపమ్మొనేసె – నం
దున్న జనమ్ముగోరఁ దుదినొప్పెను దర్శనమీయ నిత్య మా
పన్నులు రోగులున్ బహులు నానలుగా జనుదెంచుచుండి ర
త్యున్నత భక్తి మాతయు వ్యధార్తుల నూఱటబుచ్చనందఱిన్.

ఒకనాఁడు భౌతికశరీరముంగూర్చి మహాతపస్విని యిట్లుపన్య సించె. స్థూలసూక్ష్మకారణభేదమున శరీరము ముత్తెఱంగులు. స్థూలమున 25 తత్త్వములు. మనోబుద్ధులు 2 సూక్ష్మజ్ఞానేంద్రియములు 5. సూక్ష్మకర్మేంద్రియములు 5. ప్రాణములు 5. సూక్ష్మమునకు 15తత్త్వములు. ఇదియగమ్యము. తగులఁబడనిది తడుపఁబడనిది. అజ్ఞానము కారణశరీరము. జీవుఁడు సాహంకారుఁడై సూక్ష్మశరీరసంబంధియై స్థూలశరీరకర్తయై సుకృత దుష్కృతము లొనర్చుచు సుఖదుఃఖాది ద్వంద్వముల గట్టువడి పెక్కుశరీరములఁ బ్రవేశించి కర్మఫల మనుభవించి స్వర్గ నరక సుఖదుఃఖంబులఁ జూఱలాడి తత్ఫలానంతరము పునర్జన్మ ప్రవాహంబులంబడి వానినుడులఁ దప్పుకొనలేక బాధపడు చుండును.

పూర్వజన్మపుణ్యపరిపాకంబున గురుపూజ గావించి జ్ఞానియై మిథ్యాజీవస్వరూప సత్యాత్మస్వరూపము లెఱింగి అహంబ్రహ్మ

యని నిర్వికార, నిర్గుణ, నిరాకార సాక్షిమాత్రుడని గ్రహించి శరీరత్రయము నశింపఁజేసి పరబ్రహ్మస్వరూప మందవలయు. ఇదియే దేహముక్తి. కైవల్యప్రాప్తి, మోక్షసిద్ధి బ్రహ్మజ్ఞాన సాధనము. అజ్ఞాననాశనము. కారణశరీరదహనము. సూక్ష్మ శరీరనాశనము. ముక్తిప్రదము.

సర్వప్రాణు లాహారనిద్రావ్యవహారులు. వారికి మిన్నలు విగ్రహారాధకులు – వారికధికులు బ్రహ్మధ్యానులు – వారికి పూజ్యులు బ్రహ్మదర్శకులు – వారికుత్తములు బ్రహ్మసాక్షాత్కారులు – వారికన్న ఘనులు సదానందసంతృప్తికాశకులు.

* * * * *

వందలు వేలు మించి తనభక్తులుచేరిన యొక్కనాఁడు మ
ధ్యందినభానుఁడేఁగినను దర్శనమీయమి మాత, చింతచే
నందఱు గుంద ముందుపడె నబ్బురమౌ నొకలేఖ మందిరం
బందున లేనటంచు నిపుణర్మిలిఁ జేరితినంచుఁ జెప్పుచున్.

అష్టసిద్ధులు నన్యకాయప్రవేశ
మాకసమున యానమ్ము సామాన్యమగుట
మాత నాల్గుయామములు సమాధివీడి
నన్యకాయంబునందెందొ యరిగియుండు.

**1954** ఆగష్టు **25**వ నాఁడు

యోగినీ హృదంతరమందునుండి వెడలె
ప్రణవనాదమ్ము శ్రావ్యమై పాపనాశ
నమయి కొన్నియామమ్ము లనంతవిశ్వ
మందు లీనమై తదుపరి నస్తమించె.



శ్రీ పెనుమెత్స మహాయోగిని

అది గని తల్లికోరెఁ దనయన్ సుధ నిమ్మని – కోరినంత స
మ్మోదమున మజ్జనుండి వెలిబుచ్చి యొసంగెను నిమ్మకాయ యం
తఁ దనివినందె దానఁ దనతల్లియు నాఁడు ముఖాంబుజమ్మునం
దుదయమునందె కాంతి యమితోజ్జ్వలమై ప్రవహించెనంతటన్.

1957 ఫిబ్రవరి 9, 10 దినమ్ములలో

సరిగ దుర్ముఖినామవత్సరమున సుదిని
పుణ్యదినమైన శివరాత్రి పొద్దుమొదలు
మూఁడు దివసముల్ దర్శనము నిడనెంచె
యోగిని యటన్నవార్తలు సాగిపోయె.

గోదావరీ కృష్ణ గుంటూరు మండల
    వాసులు నిత్యమ్ము వచ్చుచుండ
మెనుమెత్స పౌరులు విసుగువిరామము
    లడఁచి వచ్చినవారి నాదరింప
అన్నపానీయమ్ము లందఱ కిప్పించి
    భక్తసంఘమ్ము గాపాడుచుండ
బియ్యమ్ము శాకముల్ పిండివంటలు చల్ల
    పల్లిరాణి యధికభక్తిఁ బంప

రెండుదివసమ్ము లుదయమ్ము నుండి నిశ
వఱకు వచ్చిపోయెడివారు మరల వచ్చు
వారు ముదుకల యువకుల బాలబాలి
కలఁ గనులపండువాయె నా గ్రామమునను.

## పెనుమెత్స మహాయోగిని

ఊరికి నుత్తరంపుదెస యోగినికున్న పొలమ్ములోన శృం
గారసమాధి, హాలొకటి గట్టి మహాశివరాత్రినాడు తూ
ర్వారుచునుండ మంగళరవమ్ములు తూర్యనినాదమొప్పగాఁ
జేరిచి రా తపస్విని వసింప సమాధిని భక్తియుక్తులై.

ప్రోడిమినాఁటి సాంఖ్య జనముల్ పరికించుచునుండ సోదరుల్
తోడ జనించి పండిన వధూమణి భవ్యతపోనిమగ్నఁ బో
రాడి మృతింజయించిన విరాగిణి, సీత, సమాధియందు నా
క్కేడు వసింపఁజేర్చిరి బిగించిరి తాళము నింటివెల్పటన్.

అదియొక క్షేత్రమై వెలసె యాత్రికులెందఱో దర్శనార్థమం
చు దినదినంబువచ్చి కనుచూపు లభింపమి - భక్తి గొల్చిపో
యెదరు మహాత్ములాంధ్ర జనియించుట లోకము నుద్ధరింప
గద సతతమ్ము ధర్మమును గాంచుటకేగద నిక్క మారయన్

* * * *

పెనుమెత్స మహాయోగిని !
వినిపించితి నీదుమహిమ విశ్వమునకు నీ
యనుమతి లేకయె, అంకిత
మొనరించితి నాపయి దయ నొప్పెదవంచున్.

ఓం తత్ సత్.

పెనుమెత్స మహాయోగిని

# జీవిత సంగ్రహము

వాసస్థలము: కృష్ణాజిల్లా గన్నవరంతాలూకా, పెనుమెత్స గ్రామము.
జననము: ఆగస్టు 1921. తండ్రి: చెఱుకూరి బ్రహ్మయ్య. తల్లి: [illegible]
సోదరులు: 1. కుటుంబరావు, 2. వెంకటరత్నం, 3. [illegible]
: 1. అన్నపూర్ణమ్మ, 2. నాగరత్నమ్మ, 3. సూర్యకాంతమ్మ
కులము: కమ్మవారు - మతము: హిందూమతము
విద్యాభ్యాసము: 1926. విద్యాపరిసమాప్తి: 1929 - 1930

వివాహము: 8వ యేట 1929. అత్తవారియూరు: [illegible]
మామగారు: నాదెళ్ల కృష్ణయ్య; అత్తగారు: రత్తమ్మ ...
భర్త: సీతారామయ్య (వివాహమునాంటి వయస్సు 15 సంవత్సరములు)
పుష్పవతి: 1934 సంవత్సరము. - నిషేకము: 1937 సంవత్సరము.
భర్తృమరణము: 1939 - మహాశివరాత్రి పగలు 11 గంటలకు

మొదటి హితోపదేశము: దండమూడి పూర్ణయ్య చౌదరిగారివద్ద
భద్రాచలం - హంసలదీవియాత్రలు: 1945 సంవత్సరము
యోగాభ్యాసము: 1947. గురువు: కమ్మగారి అప్పన్న, ఏలూరు
ఏలూరి ఉపన్యాసము: 19-12-1948 - 3 గంటలు
సవికల్పసమాధి 8 సంవత్సరములు. దివ్యదర్శనము: 1952
ప్రజలకిచ్చిన ప్రథమ దర్శనము 1952
ప్రణవనాద బహిర్గతము, రెండవసారి అమృతము నిచ్చుట
జీవసమాధిని కోరుట: 25-8-54
గ్రంథరచన పూర్తి: 3.9-1955
ప్రజలకు దర్శనమిచ్చుట: 27-3-1956
రాజ[illegible]నాథునకిచ్చిన దర్శనము: 29-3-1956
ప్రజలకిచ్చిన ద్వితీయ దర్శనము: 30-3-1956
ప్రణవనాద బహిర్గతము రెండవసారి 30-5-1956
ప్రజలకిచ్చిన తృతీయ దర్శనము: ఫిబ్రవరి - 1957
ప్రజలకిచ్చిన చతుర్థ దర్శనము: 5-3-1958

భారతీ ప్రెస్, తెనాలి - 1958.

# స వ ర ణ

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 10 | దెల్పితి | చెప్పితి |
| 8 | 19 | పెరపెర లాడఁబో | పెరపెర లాడఁదెం |
| 17 | 2 | దరవిచ్చు | ఉదయించు |
| 18 | 18 | రఘురాముని | రఘుమాన్యుని |
| 20 | 19 | మాతాపిలుత | మాతాపితలు |
| 33 | 1 | శాశ్వశ | శాశ్వత |
| | 5 | దలంపనేల | యదేల |
| 35 | 14 | దనిరతి | దేల |
| 37 | 19 | వేల్వెలుఁగన్ | వేశ్వేలుఁగన్ |
| 41 | 16 | భోగ్యభోగ్య | భోగభాగ్య |
| 43 | 13 | నప్పువారకి | నప్పువారికి |
| 44 | 6 | పూరుషున్ | పూరుషుల్ |
| 45 | 7 | లెం | లె |
| | 8 | దున్న | ట్లున్న |
| | 12 | యోగసాధనము | నయోగ్యసాధనము. |
| 46 | 4 | యాసిక్య | యాస్తిక్య |
| 48 | 18 | క్షీరదివ్య | గోవుపాలు |
| 51 | 7 | శ్చింతనుండు | శ్చింతతనుండు |
| | 17 | సిద్దిలు | సిద్ధులు |
| 53 | 14 | హాలకు | నివ్వను |
| | 15 | ముతింకెఁ | మతింకను |
| 57 | 9 | శంకరుడు | శంకరుఁడు |
| 58 | 13 | వ్రశించు | కృశించు |
| 65 | 6 | - | మెచ్చపిచ్చమ్మ |
| | 7 | నిల్చె | నిల్చె |
| 68 | 10 | సానవనంతర | సానంతర |
| 69 | 19 | - | లతచిత్రము |
| 70 | 8 | యయ్యాది | యియ్యాది |
| 71 | 20 | గీర్వాణా | దేవా |
| 72 | 22 | తభ్యం | తుభ్యం |
| | 11 | సమాధినిలో | సమాధిలో |
| 73 | 22 | - | సిద్ధయక్ష |
| 75 | 12 | అరుసుఁడు | అర్జునుఁడు |
| 76 | 8 | ఆనందమూం బొంధి | ఆనందమ్మునుం బొంది |
| | 12 | తపాదపద్మ | తాంఘ్రి |
| 79 | 3 | కులస్థ | కులస్థు |
| | 8 | జింతల | జింతిల |
| 80 | 14 | వర్గంబు | వర్షంబు |
| | 16 | - | చీకుచింత |
| 85 | 3 | - | దివ్యహస్త |
| 87 | 4 | నా | పై |
| | 5 | పై | యే |
| | 11 | సల్పుచు | బొల్పడి |
| 88 | 9 | మందెపు దుండునో | నాభినిఁ బొందువో |
| | 21 | జాన | జ్ఞాన |
| 91 | 11 | మారము | మార్గము |

